# ఆదివారం ఆంధ్రజ్యోతి

23 ఏప్రిల్ 2017

sunday magazine






# బాహుబలి
## ఎ మేనేజ్‌మెంట్ కేస్‌స్టడీ

ఫిల్మ్ నగర్

# ప్రీతిజింటాలా ఉన్నాననే...

కేవలం గ్లామర్‌డాల్‌గానే కనిపించిన తాప్సీ పన్నును ఇక్కడ ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు. అయితే ఆమె బాలీవుడ్‌లో చేస్తున్న పాత్రలను చూసి అంతా ఆశ్చర్యపోతున్నారు. 'బేబీ', 'పింక్', 'నామ్ షబానా'లతో తాప్సీ బాలీవుడ్‌లో దూసుకుపోతోంది. సరిగ్గా ఇరవై ఏళ్ల తర్వాత డేవిడ్ ధావన్ 'జుడ్వా'కు కొనసాగింపుగా సెకండ్ పార్ట్ తీస్తున్నాడు. అందులో వరుణ్‌ధావన్ సరసన తాప్సీ నటిస్తోంది. వివిధ సందర్భాల్లో తాప్సీ వెల్లడించిన అభిప్రాయాలివి...



నాది కర్లీ హెయిర్. పొడవాటి రింగుల జుట్టుతో తెగ ఇబ్బంది పడేదాన్ని. ఆదివారం వచ్చిందంటే చాలు, షాంపూతో శుభ్రం చేయడం, ఆయిల్ పట్టించడంతోనే సరిపోయేది. దాంతో జుట్టు కత్తిరించుకోవాలనుండేది. కానీ ఇంట్లో వాళ్లు ఒప్పుకోరు. ఎవరికీ తెలియకుండా సెలూన్‌కు వెళ్లి కత్తిరించుకునేదాన్ని. జుట్టుకు చూయింగ్ గమ్ అంటుకుందని ఇంట్లో అబద్ధాలు చెప్పేదాన్ని.




ట్రావెలింగ్ అంటే చాలా ఇష్టం. బీచ్‌లంటే పడి చస్తా. మాల్దీవులు నా ఫేవరెట్ ప్లేస్. మరణించేలోపు ప్రపంచంలో వీలైనన్ని ఎక్కువ ప్రదేశాలు చూడాలనే కోరిక ఉంది. అందుకే ఏ మాత్రం సమయం దొరికినా మా సిస్టర్ షగున్ పన్నుతో కలిసి టూర్లకు వెళ్తుంటా.

మణిరత్నం సినిమాల్లో నటించాలనే కోరిక ఉంది. గుండెల్ని పిండేసే ప్రేమకథల్ని తీయడంలో ఆయనను మించినవారు లేరు.

నేను మరీ ఫెయిర్‌గా ఉన్నాననే తెలుగులో అవకాశాలు తగ్గాయి. అయితే కెరీర్ ప్రారంభంలో ఒకే యేడాదిలో పదికి పైగా సినిమాల్లో నటించిన రికార్డు ఉంది.




చిన్నప్పుడు మ్యాథ్స్‌లో పూర్. నాన్న లెక్కలు చెబుతూ మొట్టికాయలు వేసేవాడు. ఆ భయంతో లెక్కలు నేర్చుకునేదాన్ని. ఆ తర్వాత అదే నా ఫేవరెట్ సబ్జెక్ట్‌గా మారింది. ఇంజనీరింగ్ కూడా పూర్తిచేశాను.

బాలీవుడ్ డైరెక్టర్ డేవిడ్ ధావన్‌కు నన్ను పరిచయం చేసింది పూరీ జగన్నాథ్. అప్పటికే ఆయన 'చష్మే బద్దూర్' సినిమా కోసం ప్రీతిజింటాలా ఉండే అమ్మాయి కోసం వెదుకుతున్నారట. నన్ను చూడగానే ఓకే చేశారు. ఎనిమిదో తరగతిలో ఉన్నప్పటి నుంచే అంతా నన్ను 'అచ్చు ప్రీతిజింటాలా ఉన్నావ'ని అనేవారు.

# INSIDE





**బాహుబలి**
**ఏ మేనేజ్‌మెంట్ కేస్‌స్టడీ**

బాహుబలి - ఓ సినిమా మాత్రమే కాదు, తిరుగులేని మేనేజ్‌మెంట్ పాఠం. అందులోని ప్రతీ అంశం, ప్రతీ పాత్ర ఏదో ఒక పాఠాన్ని బోధిస్తుంది. 7




**లావణ్య త్రిపాఠీ**

టాలీవుడ్‌లో 'దూసుకెళ్తు'న్న 'అందాల రాక్షసి' లావణ్య త్రిపాఠీకి రెగ్యులర్ జాబ్స్ అంటే బోర్ అట. అందుకే సృజనాత్మక రంగం వైపు వచ్చానంటోంది. 12



# మిత్రవాక్యం

'గత ఏడాది మీ పనితీరు బాగానే ఉంది. అయితే, ఆర్నెల్లపాటు ప్రసూతి సెలవులోనే ఉన్నారు కాబట్టి, ప్రమోషన్ ఇవ్వలేకపోతున్నాం' అంటాడు హెచ్‌ఆర్ మేనేజరు. 'మన టీంలో మీరే బెస్ట్. కానీ పిల్లలకు జ్వరాలనో, జలుబనో వారానికి నాలుగురోజులు ఆలస్యంగానే వస్తారు. మీకు ఇంక్రిమెంట్ ఇస్తే... మిగతావాళ్లు గొడవ చేస్తారు. సారీ' అంటూ తప్పించుకునే ప్రయత్నం చేస్తాడు బాస్. ఎంత అన్యాయం? ఒక్క భారత దేశమనే కాదు, ప్రపంచమంతటా ఇదే ధోరణి. కెరీర్ మహిళ, తల్లి అయ్యాక ... జీతభత్యాల విషయంలో, పదోన్నతుల విషయంలో... పురుషుడితో పోలిస్తే ఇరవైశాతం మేర నష్టపోతోందని గణాంకాలు చెబుతున్నాయి. పిల్లల్ని కనడం ప్రకృతి మహిళకు అప్పగించిన ముఖ్య బాధ్యత. ఆ రూపంలో సమాజానికి ఓ పౌరుడిని అందిస్తుందామె. ఆ బాబో, పాపో పెరిగి పెద్దయి... ఉద్యోగులుగా సేవ చేస్తారు. సంపాదనాపరులుగా పన్ను చెల్లిస్తారు, శాస్త్రవేత్తలుగా ఆవిష్కరణలు చేస్తారు. సమాజాన్ని ముందుకు తీసుకెళ్లడానికి సాయపడతారు. అంటే, మాతృత్వం కూడా ఓ సామాజిక బాధ్యతే. చట్ట ప్రకారం ఇవ్వాల్సిన సెలవులిచ్చి, తామేదో మహోపకారం చేసినట్టు చంకలు గుద్దుకోవడం కాదు. మాతృమూర్తి హోదాలో ఆఫీసుకు తిరిగొచ్చాక ఆ బాలింతరాల్ని ప్రమోషన్‌తో గౌరవించాలి. ఇంక్రిమెంట్‌తో సత్కరించాలి. ఇది సమాజం బాధ్యత, కంపెనీల బాధ్యత. 'కార్పొరేట్ సోషల్ రెస్పాన్సిబిలిటీ' లాంటిదే 'వర్క్‌ప్లేస్ సోషల్ రెస్పాన్సిబిలిటీ' కూడా.



## ప్రియమైన 'ఆంధ్రజ్యోతి'కి...

### అసలైన యోగం

సర్వసంగ పరిత్యాగానికి అసలైన నిర్వచనం ఇచ్చిన యోగుల గురించి తెలుపుతూ ఇచ్చిన 'క్యాంపస్ సన్యాసులు' కథనం చాలా ఆసక్తికరంగా ఉంది. ప్రతి దానికీ ముందు 'నా', 'మా' అనే అక్షరాలను వాడడమే మనకు తెలుసు. ఆ పరిధిని దాటి, ఆ రెంటినీ కలిపి ప్రతి విషయాన్నీ 'మన' అనే సువిశాలమైన కోణంలో ఆలోచించడం యోగులకు మాత్రమే సాధ్యం. 'జగమంత కుటుంబం వారిది... ఏకాకి జీవితం కూడా వారిదే!' యువ సన్యాసుల జీవనతత్వం అర్థం చేసుకోవడం అందరికీ సాధ్యం కాదు.

**- డాక్టర్ శివభూషణం,** కర్నూలు

### 'భగీరథ' శ్రీరాం

గుక్కెడు నీళ్ల కోసం ఎన్నో కిలోమీటర్లు నడిచివెళ్లే మహిళలు ఎందరో కనిపిస్తారు రాజస్థాన్‌లో. ఆ ఎడారి రాజ్యంలో వర్షపు నీటిని నిల్వచేసి ప్రజల దాహం తీరుస్తున్న శ్రీరాం వెదిరె నిజంగా అపర భగీరథుడే. సకల ప్రాణికోటికి నీరే ఆధారం. టెక్నాలజీని ఉపయోగించి ఇసుక నేలలో నివసించే వారి కరువును పారదోల వచ్చనే శ్రీరాం నిజంగా ప్రశంసనీయుడు.

**- ప్రదీప్,** రాంనగర్

### బతుకుతెరువు

రూపాయి సంపాదించే మార్గం తెలియక, చదివిన చదువు జీవితంలో ఉపయోగపడక నిరుత్సాహంతో, నిస్సహాయతతో నలిగిపోతున్న నేటి యువతరానికి చక్కని సందేశాన్ని ఇచ్చింది 'బుల్లెమ్మ' కథ. "బతికించి మరీ బతుకుతెరువు చూపించావా బుల్లెమ్మా" అనే వాక్యం నాకెంతో నచ్చింది. రామకృష్ణకు ఎదురైన అనుభవాలు, మనలో చాలామందికి కూడా ఎదురయ్యేవే.

**- ఎం. బిందు మాధవి,** ఈమెయిల్

### భలే మండి

'ఆఫీసులోనే మండి' పెడుతున్నారని తెలుసుకుని ఆశ్చర్యపోయాం. బెంగుళూరులో మొదలైన ఈ 'సాఫ్ట్‌వేర్ సాగు' త్వరలోనే అన్ని నగరాల్లోకి విస్తరిస్తుందని ఆశిద్దాం. అలా విస్తరిస్తే రసాయన ఎరువులతో పండించే కూరగాయలను తినాల్సిన ఖర్మ ఉండదు. అలాగే కాంక్రీట్ జంగిల్స్‌లో కాలుష్యం కాస్తయినా తగ్గుతుంది.

**- యాదగిరి, మాధవి,** అలకాపురి

### అంతటా మనమే !

ఒకప్పుడు విదేశాల్లో సినిమా షూటింగ్ చేయాలంటే నిర్మాతలు తెగ ఆలోచించేవారు. కథానుగుణంగా అవసరమైతేనే అంత దూరం వెళ్లేవారు. ఇప్పుడు ఆ పరిస్థితి లేదు. అందుకు సాక్ష్యమే 'దుబాయ్‌లో బాలీవుడ్ థీమ్‌పార్క్' ఏర్పాటుచేయడం. విదేశాల్లో కూడా మన సినిమాలకు ఆదరణ పెరుగుతుండడం ఆనందంగా ఉంది.

**- టి.ఎస్.ఎన్. మూర్తి,** విశాఖపట్నం

బటర్ చికెన్ ఆర్డర్ ఇచ్చి విశ్రాంతిగా వెనక్కి వాలాడు సురేష్. కొద్ది నిమిషాలకు వెయిటర్ ఆర్డర్ తీసుకొచ్చిన అలికిడి వినిపించడంతో కళ్లు తెరిచాడు. ఎదురుగుండా ఎరుపురంగులో రెండు అరలున్న టెలిఫోన్ బూత్ కనిపించింది. ఒక అరలో నాన్, రెండో అరలో బటర్ చికెన్ గ్రేవీ. అప్రయత్నంగా మొహం మీద చిరునవ్వు వచ్చింది. సగం కడుపు నిండిపోయింది.



# హోటు హోటుగా... ప్లేటు లేకుండా!

ఏ వీకెండ్‌లోనో లంచ్‌కు వెళ్లినప్పుడు మీక్కూడా ఇలాంటి వింత అనుభవం ఎదురు కావచ్చు. అతిథులను ఆకట్టుకోవడానికి హోటల్ పరిశ్రమ వినూత్న వడ్డనలు చేస్తోంది. కాలంతో పాటు మెనూలోని పదార్థాలు మారుతున్నాయి కానీ వడ్డించే ప్లేట్లు మాత్రం తరాల తరబడి అలాగే ఉంటున్నాయి. వాటిని చూసీ చూసీ విసుగెత్తిపోయిన ఏ సృజనశీలో ఇదిగో ఇలా కొత్త ఆకారాల్లో వడ్డనకు సిద్ధమయ్యాడు. 'ట్రెండ్‌ని ఫాలో అయిపోవాలి అంతే' అన్నట్టు మిగిలిన వాళ్లూ అనుసరించడం మొదలుపెట్టారు. ఇలా రుచుల పరిశ్రమ 'ఫైన్ డైనింగ్' నుంచి 'ఫన్ డైనింగ్'వైపు అడుగులేస్తోంది.

ముంబయిలోని 'లైట్ హౌస్ కెఫే' యజమాని కరణ్ మాట్లాడుతూ "వినియోగదారులు తమకందే సేవలు వినూత్నంగా ఉండాలని కోరుకుంటున్నారు. ఆ క్రమంలో వడ్డన కొంచెం ఆలస్యమైనా ఓపిగ్గా ఎదురు చూస్తున్నారు. మారుతున్న అభిరుచులే ఈ ధోరణికి కారణం' అన్నారు. "సామాజిక మాధ్యమాలు సైతం మా ఫుడ్ ప్రెజెంటేషన్‌ని ప్రభావితం చేస్తున్నాయి" అంటున్నారు షెఫ్ రాజేష్ దుబే. అందుకు కారణం కూడా వివరిస్తూ "సంప్రదాయ వంటలు ఏ హోటల్లో అయినా దాదాపు ఒకే విధంగా ఉంటాయి. దీంతో వాటిని అతిథికి ఎలా వడ్డించామన్నదే కీలకంగా మారుతోంది. వడ్డనలో ప్రత్యేకత చూపించగలిగితే... వినియోగదారులు వాటిని సోషల్ మీడియాలో అప్‌లోడ్ చేస్తున్నారు" అంటారు. రెస్టరెంట్లు 'ప్లేటు' ఫిరాయించడానికి ఇదీ అసలు కారణమన్నమాట!















# తల్లీ నిన్ను దలంచి...

**సృష్టికర్త బ్రహ్మకు ఇల్లాలుగా, ఆ బ్రహ్మచేసే సృష్టికి తానే ఓ మార్గదర్శక శక్తిగా విరాజిల్లే దేవత సరస్వతి. బ్రహ్మ చేతులలో ఉండే చతుర్వేదాలకు మూలాధారం ఆ తల్లే. లౌకికంగా సృష్టిలోని జీవరాశులన్నిటికన్నా మనిషి జ్ఞానవంతుడై ప్రకాశించటానికి ఆ చల్లనమ్మ చక్కని కరుణారస వీక్షణాలే కారణం. ఆ అమ్మ ఆశీస్సులు ఉంటేనే ఎవరికైనా నోట మాట పలికేది. ఆ తల్లి దయ ఉంటేనే ఎవరినైనా విజయం వరించేది.**

దైవమ్

సరస్వతీదేవి రూప విశేషాలు అనేకానేకం. తెల్లగా మల్లెపూవులా హంసవాహనం మీద కూర్చొని ఉండే రూపం అందరికీ తెలిసిందే. ఇదికాక సందర్భానుసారంగా ఆ తల్లికి ఎన్నెన్నో రూపాలున్నాయి. చేతుల సంఖ్య, ఆ చేతుల్లో ఉండే ఆయుధాలు కూడా మార్పుతో కనిపిస్తాయి.

శుద్ధ విద్యాదేవి రూపాన్ని పరిశీలిస్తే ఈ రూపంలో నాలుగు చేతులతో విరాజిల్లుతుంది అమ్మ. ఆ నాలుగు చేతులలో కుడివైపున ఉండే కింది చేయి అభయముద్రను, రెండో చేయి జ్ఞానముద్రను కలిగి ఉంటాయి. ఎడమవైపున ఉండే కింది చేతిలో జపమాల, పై చేతిలో పుస్తకం ఉంటాయి. ఎంతో ప్రసన్నంగా కనిపిస్తూ ఉంటుందా తల్లి.

వాక్కుకు దేవత అయిన సరస్వతి ప్రస్తావన రుగ్వేదంలో ఉంది. అలాగే మన సంప్రదాయంలో మహాకాళి, మహాలక్ష్మీ, మహాసరస్వతి అనే మూడు శక్తులున్నాయి. ఆ ప్రకారంగా చూస్తే సరస్వతి మహాశక్తి స్వరూపిణి. మహాసరస్వతి అమ్మవారికి ఎనిమిది చేతులుంటాయి. చంద్రకాంతితో సమానమైన దివ్యకాంతితో మహాసరస్వతీదేవి శుంభుడు అనే భీకర రాక్షసుడి సంహారం కోసం అవతరించింది. తన చేతిలోని కమండల జలాలతో ఆ అసురుడిని అంతం చేసింది.



### చదువులకు రూపం

సృష్టిలో ఉన్న చదువులన్నీ ఆ చదువులకు సంబంధించిన పుస్తకాలు, కాగితాలు, కలాలు వగైరా వస్తువులన్నీ ఆ అమ్మకు ప్రతిరూపాలే. అందుకే చదువుకొనేటప్పుడు నిశ్చలబుద్ధితో ఏకాగ్రదృష్టితో చదవాలి. చదవటానికి ఉపకరించే వస్తువులను ఎంతో పవిత్రంగా చూడాలి. అప్పుడే చదువు మనసుకెక్కుతుంది. భవిష్యత్తు బంగారుమయమవుతుంది. శ్రీహర్షుడు విద్యాధిదేవతను వర్ణించిన తీరు ఎంతో గొప్పగా ఉంటుంది...

చదువులమ్మ కంఠ భాగంలో గంధర్వ విద్య, త్రివళులలో త్రయీవిద్య, కటాక్షవీక్షణాలలో సాహిత్య శాస్త్రాలు, నాభి, ఉదర భాగాలలో అభిచార క్రియలు ఉన్న అధర్వవేదం, చరిత్ర, శిక్షాశాస్త్రం ఉంటాయంటారు. ఈ రూపాన్ని హృదయంలో ప్రతిష్ఠించుకుంటే సృష్టిలోని సకల విద్యలు, శాస్త్రాలు ఆ అమ్మలోనే కనిపిస్తాయి.

### చల్లని తల్లి

సరస్వతీదేవి అక్షరాలా కన్నతల్లిలాంటి చల్లనితల్లే. ఆ అమ్మను మనసులో నిలుపుకొంటే చాలు నోటివెంట సుశబ్దాలు శోభిల్లుతూ వస్తాయి. అంటే మంచి మంచి మాటలు, పదిమందికీ నచ్చే మాటలు, మంచి పని జరిగేందుకు కావలసినన్ని మాటలు ఆ వాగ్దేవి కరుణతో వచ్చేస్తాయి. ఈ విషయాన్ని పోతన రాసినట్టుగా పండితులు అభిప్రాయపడుతున్న "తల్లీ! నిన్ను దలంచి పుస్తకము చేతన్ బూనితిన్..." అనే పద్యం స్పష్టం చేస్తుంది. పద్యంలో చల్లని తల్లిని కవి 'జగన్మోహినీ! పుల్లాబ్జాక్షీ! సరస్వతీ భగవతీ పూర్ణేందు బింబాననా' అని కీర్తించాడు. దీనికి కారణమేమంటే జగత్తునంతటినీ తన జ్ఞానానందంతో మోహింపచేయగల గొప్ప దివ్యశక్తి ఆమె. నిండు చందమామలాగా విశాలమైన కళ్ళతో... భగవతి అయిన ఆ సరస్వతి తన బిడ్డల్లాంటి భక్తులందరినీ కరుణిస్తూ ఉంటుంది అనేది పద్యంలో ప్రతిబింబించే ఆ చల్లని తల్లి దివ్యజ్ఞాన సుందరరూపం.

జీవితం ప్రశాంతంగా, హాయిగా, ఆనందంగా సాగటానికి సరస్వతి ధ్యానం, ఆరాధన, జపం ఎంతో ఉపకరిస్తాయని సాధకులు చెబుతున్నారు. ఇంతటి శక్తి ఉంది కనుకనే తొలినాళ్ళ నుంచి నేటిదాకా కవిత్వ రంగంలో ఉన్న ఎవరిని కదిపినా ఈ అమ్మను స్తుతించని వారు కనిపించరు. అక్షరం ముక్క లేని వ్యక్తి మహాకవి కాళిదాసుగా వెలుగొందాడన్నా, వ్యాసవాల్మీకాదులు భారత రామాయణాదులను రచించారన్నా, యాజ్ఞవల్క్యుడు పోగొట్టుకున్న విద్యనంతటినీ తిరిగి సంపాదించాడన్నా అదంతా సరస్వతీ మాత దయవల్లే జరిగింది.

### నదిగా కూడా

సరస్వతీదేవి నదిగా కూడా భూలోకవాసులను అనుగ్రహించినట్టు పురాణాలలో విశేషాంశాలు ఉన్నాయి. గాయత్రికి, సరస్వతికి అలాగే మరికొన్నిచోట్ల గంగ, లక్ష్మి, సరస్వతులకు కలిగిన స్పర్థల కారణంగా ఆ దేవతామూర్తులందరూ భూలోకంలో నదులుగా అవతరించారు. దేవీభాగవతం, బ్రహ్మవైవర్త పురాణం లాంటి పురాణాలు ఈ విషయాలను వివరిస్తున్నాయి. ఆ నేపథ్యం కూడా మానవాళి ప్రయోజనమే. సరస్వతి నదిగా అలా భూలోకవాసుల ప్రయోజనం కోసం అవతరించింది. త్రివేణీ సంగమంలో గంగ, యమున, సరస్వతి నదులు కలిసేచోట అంతర్వాహినిగా ఇప్పటికీ పూజలందుకొంటోంది. ప్రవాహంగా మానవలోకంలోని బాహ్య మలినాలను తొలగించినట్టే చదువుల తల్లిగా మనసులోని జడత్వాన్ని పోగొడుతూ మహాశక్తి స్వరూపిణిగా జోతలు అందుకొంటోంది చదువులమ్మ.

● శ్రీమల్లి , 98485 43520

# మా అబ్బాయికి ఇంటర్వ్యూ భయం...




**ప్ర: నమస్కారం. మా అబ్బాయి మంచి మార్కులతో ఎంబీయే పూర్తి చేశాడు. కానీ ఇంటర్వ్యూలకు వెళ్లిన ప్రతిసారీ విఫలమౌతున్నాడు. ముఖ్యంగా 'హెచ్చార్' రౌండ్‌లో వెనుదిరగాల్సి వస్తుంది. దాంతో ఆత్మన్యూనతకు గురౌతున్నాడు. ఏం చేయమంటారు?**

**- కె. చంద్రశేఖర్, ఈ మెయిల్**

**జ:** విద్యాసంస్థల్లో గురువులు, ఇంట్లో తల్లిదండ్రులు శ్రద్ధ తీసుకోవడం వల్లే పిల్లలు బాగా చదువుతున్నారు. మంచి ర్యాంకులు తెచ్చుకుంటున్నారు. కానీ మార్కులు వారి సర్వతోముఖాభివృద్ధికి దర్పణం కాదు. ఎందుకంటే ర్యాంకర్లలో చాలామందికి సామాజిక నైపుణ్యాలు (సోషల్ స్కిల్స్) లేవు. పదిమందిలో ఎలా మాట్లాడాలో తెలియట్లేదు. బయటకు వెళ్లి ఒక వ్యవహారాన్ని చక్కబెట్టే నేర్పు ఉండట్లేదు. కారణం... కోరకుండానే తల్లిదండ్రులు వారికి అన్నీ అమర్చి పెడుతున్నారు. దాంతో బయటి ప్రపంచాన్ని చూసే అవకాశం గానీ, అర్థం చేసుకునే అవసరం గానీ వాళ్లకు రావట్లేదు. చదువు పూర్తయిన తర్వాత, సమాజంలోకి అడుగుపెట్టగానే జీవన నైపుణ్యాలు కొరవడి సమస్యలు తలెత్తుతున్నాయి. ఒక ఇంటర్వ్యూలో 'ఐఐఎమ్' నుంచి ఎంబీయే చేసిన అభ్యర్థిని 'మీ జీవితంలో మీరు ఎదుర్కొన్న క్లిష్టమైన సమస్యేంటి?' అని అడిగితే 'ఇల్లు మారడం' అని చెప్పాడట. ఒక పెద్ద టీమ్‌ని లీడ్ చేయాల్సిన వ్యక్తి ఇలాంటి సమాధానం చెబితే ఉద్యోగం వస్తుందా? చదువుకు, సామాజిక నైపుణ్యాలకు సమ ప్రాధాన్యం ఇవ్వకపోవడం వల్లే ఇలాంటి సమాధానాలు వస్తున్నాయి. అందుకే విద్యార్థి దశ నుంచే 'సొసైటీ ఎక్స్‌పోజర్'ను ప్రోత్సహించడం అవసరం.

మీ అబ్బాయి చదువుల్లో బాగున్నాడు. అందుకే ఇంటర్వ్యూ తొలిరౌండ్‌లో సులభంగా విజయం సాధిస్తున్నాడు. హెచ్చార్ రౌండ్‌లో అభ్యర్థి డ్రెస్ సెన్స్, ప్రవర్తన, మానసిక దృఢత్వం, సమయస్ఫూర్తి, ఇతర ఉద్యోగులతో సమన్వయం చేసుకునే నేర్పు, నాయకత్వ లక్షణాలు... ఇలా చాలా విషయాలను పరిగణనలోకి తీసుకుంటారు. ముఖ్యంగా ఈ తుది అంకంలో మానవ వనరుల విభాగం వాళ్లు సంధించే ప్రశ్నలకు ఆత్మవిశ్వాసంతో సమాధానం చెప్పాలి. తెలియని విషయాలను నిజాయతీగా ఒప్పుకోవాలి. కొన్ని ప్రశ్నలకు లాజికల్‌గా జవాబులు ఇవ్వాల్సి ఉంటుంది. భావోద్వేగాలను అదుపులో ఉంచుకుని, ప్రశాంత చిత్తంతో ఉండాలి. ముఖంపై చిరునవ్వు చెదరనీయకూడదు. ఇంటర్వ్యూకు వెళ్లేముందు గట్టిగా గాలి పీల్చి వదలడం లాంటి శ్వాస సంబంధిత వ్యాయమాలు చేయాలి. ఇంటర్వ్యూలో ఏయే విషయాలు చెబుతామనుకుంటున్నారో అవన్నీ ఒక కాగితంపై రాసుకోవడం మంచి అలవాటు. ఈ రైటింగ్ మీలో ఆదుర్దా తగ్గడానికి థెరపీలా పనిచేస్తుంది. అసలు ఇంటర్వ్యూకి వెళ్లడానికి ముందు కొన్ని మాక్ ఇంటర్వ్యూలకు హాజరవడం ద్వారా కూడా మంచి ఫలితాలు సాధించవచ్చు.

**ప్ర: నమస్తే మేడమ్. మా అమ్మాయి వయసు పదమూడేళ్లు. ఛాయ తక్కువ. తెల్లగా అవ్వాలని రకరకాల క్రీములు వాడుతుంది. అవి అయిపోతే కొత్తవి తీసుకురాలేదేంటని గొడవ చేస్తుంది. నల్లగా ఉంటే అందరూ కామెంట్ చేస్తారని బాధపడుతుంది. ఏం చేయాలి?**

**- ఎ. సుజాత, హైదరాబాద్**

**జ :** ఈ మధ్య కాలంలో అందమంటే తెలుపే అన్న భావనను కొన్ని వాణిజ్య ప్రకటనలు పెంచి పోషిస్తున్నాయి. ఆ ప్రభావం టీనేజ్ పిల్లలపై మరీ ఎక్కువగా కనిపిస్తుంది. అందం మనసుకు సంబంధించింది. మీకు అందంగా కనిపించేది మరొకరికి అందంగా కనిపించకపోవచ్చు. అదే మంచి గుణాలు అందరికీ మంచిగా అనిపిస్తాయి. అంతా హర్షిస్తారు. గొప్ప విజయం సాధిస్తే అందరూ అభిమానిస్తారు. మీ అమ్మాయికి ఇదే విషయాన్ని విడమరచి చెప్పండి. అందం కంటే ఆరోగ్యానికి ప్రాధాన్యం ఇవ్వాల్సిన వయసు ఇది. రోజూ ఎక్సర్‌సైజుతో పాటు మంచి ఆహారం తీసుకునేలా చూడండి. 'ఎప్పుడూ సంతోషంగా ఉండాలి. వాస్తవికంగా ఆలోచించాలి' అని మీ అనుభవాలను జోడించి చెప్పండి. తెల్లగా ఉండే వాళ్లు అందంగా ఉంటారనే భావన తప్పు అని నచ్చజెప్పండి. అంతేకాదు అందంగా ఉండేవాళ్లంతా ఆనందంగా ఉన్నారా? అని ప్రశ్నించండి. అందంగా ఉండటం కాదు ఆనందంగా ఉండటం ముఖ్యం అని చెప్పండి. నల్లగా ఉన్నా అందరి గౌరవాన్నీ పొందిన వారి గురించి కథలుగా చెప్పండి.

తెలివితేటలు, వ్యక్తిత్వంతో నీ ముఖంలో వచ్చే మెరుపే నీకు కొత్త అందాన్ని తెచ్చి పెడుతుంది. అప్పుడు ఈ మేకప్పులేవీ అక్కర్లేదు..." అని పిల్లలకు అర్థమయ్యేలా వివరించండి. తద్వారా వారిలో ఆత్మవిశ్వాసాన్ని పెంచండి.

ఈ మధ్య ఒక సంస్థ 'డార్క్ ఈజ్ బ్యూటిఫుల్' అనే క్యాంపెయిన్ నిర్వహించింది. నల్లగా ఉన్నామని న్యూనతాభావానికి గురైనవాళ్లు ఆత్మవిశ్వాసంతో భవిష్యత్తును ఎలా తీర్చిదిద్దుకున్నారో ఆ క్యాంపెయిన్‌లో వివరించారు. వీలైతే అలాంటి కార్యక్రమాలకు మీ అమ్మాయిని తీసుకెళ్లండి.



**సుజాతా రాజమణి**
కన్సల్టెంట్ సైకోథెరపిస్ట్,
కిమ్స్ హాస్పిటల్

మీ పిల్లల ప్రవర్తనకు సంబంధించి ఏమైనా ప్రశ్నలుంటే మాకు పోస్ట్‌లో గానీ, మెయిల్‌లో గాని పంపవచ్చు.
**అడ్రస్ :** ఆదివారం ఆంధ్రజ్యోతి, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33, **మెయిల్ ఐడి :** sunday.aj@gmail.com

కవర్ స్టోరీ

# బాహుబలి 2

## ఎ మేనేజ్‌మెంట్ కేస్‌స్టడీ

**ఆన్‌లైన్‌లో టికెట్ బుక్ చేసుకుని... సరిగ్గా టైటిల్స్ పడే సమయానికి పాప్‌కార్న్ ప్యాకెట్‌తోనో, పల్లీల పొట్లంతోనో సీట్లో సెటిలైపోయి... శుభం కార్డు పడగానే వాచీ చూసుకుని, వేగంగా ఇంటికొచ్చే యడానికి ఇదేం అల్లాటప్పా సినిమా అనుకుంటున్నారా? బా...హు....బ....లి - 2! తెరమీది పాత్రల్నే కాదు, తెరవెనుక వ్యూహాల్నీ అర్థం చేసుకోవాలి. ఎంత గొప్పగా తీశారన్నది కాదు, ఎంత పక్కాగా పని చేశారన్నదీ ఆకళింపు చేసుకోవాలి. ఆ మాత్రం అవగాహన చాలు... మనలోని 'బాహుబలి' బయటికొచ్చేస్తాడు.**

పై పైకి ... 'బాహుబలి-2' ఓ సినిమా, భారీ సినిమా, బ్రహ్మాండమైన సినిమా. మహా బడ్జెట్‌తో, మహామహా తారాగణంతో, అంతర్జాతీయ శ్రేణి టెక్నాలజీతో రూపొందిన సినిమా.

అంతేనా, ఆమాత్రం దానికే... ప్రేక్షకులు పూనకం వచ్చినట్టు ఊగిపోవాలా, మీడియా కథనాల మీద కథనాలు కుమ్మరించాలా? కాదుకాదు, ఇంకేదో ఉంది. ఆ మాహిష్మతి కోట రహస్యాన్ని ఛేదించగలిగితే... సప్త సముద్రాలకు అవతల, ఒంటిస్తంభం మేడ మీదున్న బంగారు పంజరంలోని 'గెలుపు' చిలక గుట్టు రట్టవుతుంది. ఈ కోణాన్ని కనుక విస్మరిస్తే 'బాహుబలి-2'ను అసంపూర్ణంగా చూసినట్టే. జక్కన్న శ్రమను పాక్షికంగా అర్థం చేసుకున్నట్టే.

సినిమా జీవితకాలం...
ఆడకపోతే అరపూట.
ఆడితే ఆరువారాలు.

ఆతర్వాత ఎవరూ పట్టించుకోరు. ఒక సినిమాగా 'బాహుబలి'కి అయినా ఈ మాటే వర్తిస్తుంది. కానీ, దర్శక నిర్మాతలు ఆ చిత్రాన్ని.... సినిమాకు మించి, ఓ బ్రాండ్‌గా తీర్చిదిద్దారు. శక్తిమంతమైన బ్రాండ్‌కు ఉండాల్సిన లక్షణాలన్నీ అందులో ఆవాహన చేశారు. దీనివల్ల సినిమా పరిధి పెరిగింది. వ్యాపారకోణం 360 డిగ్రీలకు విస్తరించింది. యుద్ధ దృశ్యాల్ని చిత్రించడంలోనే కాదు.... వ్యాపార యుద్ధంలోనూ 'బాహుబలి' బృందం ఆరితేరింది. యుద్ధం చేసి గెలవడం గొప్పే. కానీ, యుద్ధం చేయకుండానే గెలవడం ఇంకా గొప్ప - అంటుంది చైనీయుల పోరాట వ్యూహ గ్రంథం.... 'ఆర్ట్ ఆఫ్ వార్'. రిస్క్ మేనేజ్‌మెంట్ నిపుణులు చెప్పేదీ అదే. ఏ వ్యాపారంలో అయినా నష్టానికి ఆస్కారం ఉంటుంది. తెలివైనవాడు సాధ్యమైనంత మేర ఆ తీవ్రతను తగ్గించుకుంటాడు. వీలైతే నామమాత్రం చేసుకుంటాడు. బాహుబలి 'రిస్క్ మేనేజ్‌మెంట్' టీమ్ ఈ సూత్రాన్నే ఆశ్రయించింది. మొదటి భాగం విడుదల సమయానికే నిర్మాతలు సురక్షిత స్థానంలో ఉన్నారు. రూ.650 కోట్ల వసూళ్లంటే మాటలు కాదు. ఇక, 'బాహుబలి-2' వ్యాపారం గురించి దిగులుపడాల్సిన అవసరమే రాలేదు. 'బిజినెస్ స్టాండర్డ్', 'మింట్' తదితర వ్యాపార పత్రికల కథనం ప్రకారం...



## బాహుబలి స్కూల్ ఆఫ్ మేనేజ్‌మెంట్

ప్రధాన క్యాంపస్ **మాహిష్మతి**

ఛాన్సలర్ : **విజయేంద్ర ప్రసాద్**

సలహామండలి: **కె.రాఘవేంద్రరావు, కరణ్‌జోహార్ తదితరులు**

చీఫ్ అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్ : **వల్లి**

డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఫైనాన్స్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ మార్కెటింగ్ & బ్రాండింగ్ : **శోభు యార్లగడ్డ, ప్రసాద్ దేవినేని**

డిపార్ట్‌మెంట్ ఆఫ్ మ్యూజిక్ : **కీరవాణి**

డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఫ్యాషన్ స్టడీస్ : **రమా రాజమౌళి**

డిపార్ట్‌మెంట్ ఆఫ్ ప్యాకేజింగ్ : **సాబు సిరిల్ (ఆర్ట్), శ్రీనివాసమోహన్ (గ్రాఫిక్స్), కోటగిరి వెంకటేశ్వరరావు (ఎడిటింగ్), సెంథిల్ (సినిమాటోగ్రఫీ)**

ఫ్యాకల్టీ : **సుదీప్, తనికెళ్ల భరణి, అడివి శేష్, ప్రభాకర్‌గౌడ్ తదితరులు**

డిపార్ట్‌మెంట్ ఆఫ్ క్రైసిస్ మేనేజ్‌మెంట్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ ప్లానింగ్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఎగ్జిక్యూషన్ **ఎస్.ఎస్. రాజమౌళి**

డిపార్ట్‌మెంట్ ఆఫ్ క్రౌడ్ మేనేజ్‌మెంట్ : **ప్రభాస్ (బాహుబలి) రానా (భల్లాలదేవ), అనుష్క (దేవసేన), తమన్నా (అవంతిక)**

డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఎమోషన్స్ మేనేజ్‌మెంట్ : **రమ్యకృష్ణ (శివగామి)**

డిపార్ట్‌మెంట్ ఆఫ్ బిజినెస్ ఎథిక్స్: **సత్యరాజ్ (కట్టప్ప)**

డిపార్ట్‌మెంట్ ఆఫ్ కార్పొరేట్ ఫ్రాడ్స్ : **నాజర్ (బిజ్జలదేవ)**

బోర్డ్‌రూమ్ వార్ మేనేజ్‌మెంట్ : **పీటర్ హెయిన్స్ (ఫైట్స్)**

డిపార్ట్‌మెంట్ ఆఫ్ కమ్యూనికేషన్స్ : **విజయ్‌కుమార్, అజయ్ కుమార్ (డైలాగ్స్)**

'థియేటర్, శాటిలైట్ హక్కుల్ని విక్రయించడం ద్వారానే దాదాపు ఐదొందల కోట్ల రూపాయలు వసూలు అయ్యాయి. రజనీకాంత్ 'కబాలి' ప్రీ-సేల్స్‌తో పోలిస్తే ఇది రెట్టింపు మొత్తం. ఆన్‌లైన్ వీడియో స్ట్రీమింగ్ ప్లాట్‌ఫామ్స్ కూడా బాహుబలితో బంధుత్వం కలుపుకోడానికి తహతహలాడుతున్నాయి. కామిక్ బుక్స్, నవలలు, యానిమేషన్, వీడియోగేమ్స్ ద్వారా కూడా ఓ పదికోట్ల పైచిలుకు వసూలు కావచ్చని అంచనా'. ఇప్పటికే ఆనంద్‌నీలకంఠన్ బాహుబలి ఇతివృత్తంతో 'ది రైజ్ ఆఫ్ శివగామి'ని మూడు భాగాలుగా రాస్తున్నారు. 'బాహుబలి'లో శివగామి పాత్ర మహాశక్తిమంతమైంది. ఆ ధీరవనిత కథే ఈ పుస్తకం. దాన్నే టీవీ సీరియల్‌గా మలిచే ఆలోచనలో ఉన్నారు. తెర మీద పాత్రల్ని సృష్టించడంలో రాజమౌళికి ఉన్నంత పేరే, పుస్తకంలో పాత్రల్ని సృష్టించడంలో నీలకంఠన్‌కు ఉంది. అంతర్జాతీయంగా భారతీయ ఇతివృత్తాలతో వచ్చే కాల్పనిక సాహిత్యానికి మంచి గిరాకీ ఉంది. ఇదో తిరుగులేని వ్యాపార ఆలోచన. 'మర్కెంటైజింగ్' మీదా 'టీమ్ బాహు' ఎప్పుడో దృష్టి సారించింది. హ్యారీపోటర్ బొమ్మ ఉన్న టీషర్ట్‌ను కొనేందుకు ఎగబడుతున్న జనం బాహుబలి టోపీ కోసం మాత్రం ఎందుకు ఎగబడరు? సూపర్‌మాన్ బొమ్మల కథల్ని చదివిన పిల్లలు, 'అనగనగా మాహిష్మతి..' అని మొదలుపెడితే మాత్రం ఎందుకు ఆసక్తిచూపరు? సినిమాలో వాడిన కత్తులూ, బల్లాలూ, కిరీటాల నమూనాలు దుకాణాల్లో అమ్మకానికి వస్తున్నాయి. 'బిస్కెట్‌కింగ్' బ్రిటానియాను కూడా ఈ గేమ్‌లో భాగం చేశారు. మంచ్ చాకొలెట్స్, ఒప్పో మొబైల్స్, నెస్లే ఇండియా.... తదితర ఉత్పత్తి సంస్థలూ బాహుబలి ప్రచార సైన్యంలో చేరిపోయాయి.

**బాటమ్ ఆఫ్ ద పిరమిడ్**

అభిమానులు.
సినిమా ప్రేమికులు.
తటస్థులు.
- ప్రేక్షకుల్లో మూడు రకాలు. మొదటి రెండు వర్గాలూ థియేటర్ల





దాకా వస్తే సినిమా ఓ మోస్తరుగా ఆడుతుంది. తటస్థుల్ని కూడా కదిలించగలిగితేనే, అది 'సూపర్‌హిట్'! సీకే ప్రహ్లాద్ అనే మేనేజ్‌మెంట్ నిపుణుడు 'బాటమ్ ఆఫ్ ద పిరమిడ్' సూత్రాన్ని ప్రతిపాదించారు. పిరమిడ్ పైభాగంలో సన్నగా మొదలై కిందికి వచ్చేసరికి విశాలంగా మారుతుంది. చాలా సందర్భాల్లో, అప్పటిదాకా ఉన్న కొద్దిమంది ఖాతాదారుల్ని ఆకట్టుకోడానికే మార్కెట్ వర్గాలు ప్రయత్నిస్తుంటాయి. ఎవరు గాలమేసినా ఆ కాస్త జనాభాకే. పిరమిడ్ కిందిభాగంలో ఉన్నవాళ్లని... అంటే, ఖాతాదారులు కానివాళ్లని ఖాతాదారులుగా మార్చుకోడానికి ఎవరూ ప్రయత్నించరు. ఆ వర్గాన్ని కనుక దార్లోకి తెచ్చుకోగలిగితే తిరుగే ఉండదు. 'బాహుబలి' బృందం ఆ తెలివైన పనే చేస్తోంది. తెలుగు బొమ్మల్లో దమ్ము తగ్గిపోవడంతో కోట్ల మంది ప్రేక్షకులు థియేటర్‌కు దూరమైపోయారు. నెల తర్వాతో, రెండు నెలల తర్వాతో... బుల్లితెర మీద వచ్చితీరుతుందన్న చిన్నపాటి రాజీ ఉండనే ఉంది. బాహుబలి తటస్థులలోని నిర్లిప్తతను పటాపంచలు చేస్తోంది. థియేటర్‌కే వెళ్లిచూడాలన్న కోరికను రగిలించింది.

తొలిభాగం మిగిల్చిన సస్పెన్స్, మలిభాగానికి సంబంధించిన ఆన్‌లైన్, ఆఫ్‌లైన్ ప్రచార వ్యూహాలూ గురితప్పకుండా గుండెల్లో దూసుకెళ్లాయి. దేశజనాభాలో దాదాపు పదిశాతం మంది ఓ సినిమా ట్రైలర్‌ను చూడటం అంటే మామూలు విషయం కాదు. తెలుగు పరిశ్రమలో 'బాటమ్ ఆఫ్ ద పిరమిడ్' మీద గురిపెట్టిన తొలి వ్యూహకర్త రాజమౌళే.

**ఆన్‌లైన్ వ్యూహం...**

ప్రతి చేతిలోనూ ఓ స్మార్ట్‌ఫోన్. ప్రతి స్మార్ట్‌ఫోన్‌లో ఓ ఫేస్‌బుక్ ఖాతా, ట్విటర్ అకౌంట్. ఏ తెలివైన మీడియా మేనేజర్ ఇలాంటి అవకాశాన్ని వదులుకోడు. అందులోనూ ఆన్‌లైన్ ప్రచారం... మహాచౌక! ఇక్కడ ఆలోచనే పెట్టుబడి. కాబట్టే, రాజమౌళి బృందం పబ్లిసిటీ వ్యూహమంతా సోషల్ నెట్‌వర్కింగ్ చుట్టే తిరిగింది. అలా అని, ఆఫ్‌లైన్‌ను పూర్తిగా విస్మరించలేదు. సంప్రదాయ మాధ్యమాలు కూడా ఆన్‌లైన్ పరిణామాల చుట్టూ కథనాలు అల్లితీరాల్సిన పరిస్థితిని తీసుకొచ్చారు. ప్రజల జ్ఞాపకశక్తి చాలా చిన్నది. ఈరోజు ఉన్న ఉత్కంఠ రేపు ఉండదు. కొలిమిలోని నిప్పులా... ఆ ఆసక్తిని ఏదో ఓ రూపంలో రగిలిస్తూనే ఉండాలి. ఆ చిట్కాలు రాజమౌళికి బాగా తెలుసు. పోస్టరు విడుదల చేయడం ద్వారానో, ప్రోమో కట్ చేయడం ద్వారానో జనాన్ని 'అదిగో బాహుబలి... ఇదిగో బాహుబలి' అని ఊరిస్తూనే ఉన్నారు. 'బాహుబలి దీర్ఘకాలికమైన ప్రాజెక్టు అవుతుందని ముందే భావించాం. ఆ ప్రయాణంలో ప్రేక్షకుడిని కూడా భాగం చేయాలనుకున్నాం. ఫేస్‌బుక్, ట్విటర్, ఇన్‌స్టాగ్రామ్ ... అందుబాటులో ఉన్న ప్రతి వేదికనీ అందుకు ఉపయోగించుకున్నాం' అంటారు నిర్మాత శోభు. 'కట్టప్ప బాహుబలిని ఎందుకు చంపాడు?' అన్న ప్రశ్నతో తొలిభాగాన్ని ముగించడం కూడా తిరుగులేని ప్రచార వ్యూహమే. చాలా బిజినెస్ స్కూళ్లు ఇదే విషయం మీద 'కేస్‌స్టడీ' కాంపిటీషన్లు కూడా పెట్టాయి. ఇక, నిత్య సంభాషణల్లోనూ... 'కట్టప్ప' అన్న పేరు ఏదో ఓ రూపంలో ప్రస్తావనకు వస్తూనే ఉంటుంది. 'వీర విధేయుడు' అని చెప్పడానికి, 'వాడో కట్టప్పరా బాబూ! పక్కా మేనేజ్‌మెంట్ మనిషి' అనుకోవడం సర్వసాధారణం అయిపోయింది. రాజకీయ నాయకుల ఉపన్యాసాల్లోనూ 'బాహుబలి' ఓ ఊతపదమై కూర్చుంది. 'వచ్చే ఎన్నికల నాటికి మా పార్టీలోనూ ఓ బాహుబలి పుడతాడు' తరహా స్టేట్‌మెంట్లు పతాక శీర్షికలకు ఎక్కాయి. ఉత్తరప్రదేశ్ ఎన్నికల ప్రచారంలో సాక్షాత్తు ప్రధానమంత్రే 'కట్టప్పలా దేశాన్ని కాపాడతా...' అంటూ ఓటర్లను ఉర్రూతలూగించారు. మహాబలవంతుడు, మహాశక్తిమంతుడు అనాల్సిన ప్రతి సందర్భంలో 'బాహుబలి' పదప్రయోగం కొత్తగా వచ్చి చేరింది. ఇంత ప్రచారం... కోట్లు ఖర్చుపెట్టినా రాదు. సొంతంగా ఓ మీడియా సంస్థ ఉన్నా సాధ్యం కాదు. తెలివైన మీడియా వ్యూహకర్త పర్సుకు పనిచెప్పడు, బుర్రకు పని చెబుతాడు. ఫేస్‌బుక్, గూగుల్ తదితర దిగ్గజాల బడ్జెట్‌లో ప్రచారానికి నామమాత్రపు కేటాయింపులే ఉంటాయి. కానీ, ఆ పేర్లు ఏదో ఓరూపంలో జనం నోళ్లలో నానుతూనే ఉంటాయి - బాహుబలిలా!

**'ఆపిల్' ఫార్ములా**

ఐడియా చిన్నదా, పెద్దదా? అన్నది ముఖ్యం కాదు. సొంతమా కాదా అన్నదే ప్రధానం. 'బాహుబలి' రాజమౌళి వండివార్చుకున్న సొంత కథ. ఏ హాలీవుడ్ సినిమాకో అనువాదమో అనుకరణో కానేకాదు. అలా అని, అద్భుతమైన కథనీ చెప్పలేం. మనం చిన్నప్పుడు చదువుకున్న వందలాది చందమామ కథల్లాంటిదే. ముగింపును ముందే ఊహించేయవచ్చు. అంతిమంగా మంచే గెలుస్తుంది కాబట్టి, హీరోదే పైచేయి అవుతుంది. ఏ సైన్స్ ఫిక్షనో కాదు కాబట్టి, పాత్రల్నీ స్వభావాల్నీ కథలో మలుపుల్నీ అర్థం చేసుకోడానికి బుర్రబద్దలు కొట్టుకోవాల్సిన పన్లేదు. కథలోని 'సింప్లిసిటీ', 'ఒరిజినాలిటీ' - బాహుబలిని ప్రేక్షకులకు మరింత దగ్గర చేశాయి. 'ఆపిల్' విజయానికి కూడా ఈ రెండే పునాది. 'ఏ విషయాన్ని అయినా సరళంగా చెప్పడమే చాలా కష్టమైన పని' అంటారు స్టీవ్‌జాబ్స్.

'స్లో థింకింగ్' అన్న మాట మేనేజ్‌మెంట్ వర్గాల్లో ఊతపదంగా మారింది. రాత్రికిరాత్రే ఓ నిర్ణయం తీసుకోవడం, తెల్లారగానే ఆచరణలో పెట్టేయడం, లక్ష్యాన్ని చేరుకోడానికి నానా తిప్పలూ పడిపోవడం - నిన్నమొన్నటి దాకా గొప్పగానే అనిపించేవి, అలాంటివాళ్లని






**'స్టార్‌వార్స్' పాఠాలు...**

యునైటెడ్ కింగ్‌డమ్‌లోని గ్లాస్‌గోవ్ యూనివర్సిటీ సంచలనాత్మక హాలీవుడ్ చిత్ర పరంపర 'స్టార్‌వార్స్' ఆధారంగా ఓ కోర్సును నిర్వహిస్తోంది. ప్రేక్షకుల్ని సమ్మోహపరచిన ఆ ఉత్కంఠ భరిత దృశ్యాల్ని పక్కనపెట్టి... మూల కథలోని తాత్విక కోణాన్ని ఆ కోర్సులో భాగంగా చర్చిస్తారు. స్టార్ వార్స్, ఆధ్యాత్మికత, విధి... ఈ మూడు అంశాల్నీ ముడిపెట్టి పాఠాలు చెబుతారు. ఏమో ఎవరికి తెలుసు, 'బాహుబలి-2' విడుదల తర్వాత... ఇదీ ఓ మేనేజ్‌మెంట్ పాఠం అవుతుందేమో.

హీరోలా చూసేవారు. ఆ వేగంతో గెలుపు సాధ్యమైతే కావచ్చు కానీ, పరిపూర్ణత అసాధ్యం. సహజంగా పండిన మామిడికీ, రసాయనాలతో పక్వానికి తెచ్చిన కాయకూ... ఉన్నంత తేడా అది. జపనీస్ 'కైజెన్' సూత్రం కూడా నింపాదిగానే వెళ్లమని చెబుతుంది. కానీ, స్థిరంగా, బలంగా అడుగులు వేయమంటుంది. బాహుబలి కథ కూడా... ఏ బ్యాంకాక్‌లోనో 'సింగిల్ సిట్టింగ్'లో తేల్చిపడేసిందేం కాదు. ఎప్పుడో మద్రాసులో ఉన్నప్పుడు... నాన్న విజయేంద్రప్రసాద్ సృష్టించి ఇచ్చిన ఓ రాణి, ఇద్దరు రాకుమారుల పాత్రల్ని జక్కన్న చెక్కగా చెక్కగా ఓ చిక్కని కథ తయారైంది. ప్రతి పాత్ర ఆహార్యాన్నీ, ఆయుధాల్నీ, ఆయా సన్నివేశాల నేపథ్యాన్నీ పక్కాగా కంప్యూటర్‌లో డిజైన్ చేసి, బైండ్ బుక్ సిద్ధం చేసుకున్నాకే రంగంలోకి దిగారు. ఎంత పక్కాగా వెళ్లినా... అన్నీ అనుకున్నట్టే జరగవు. అనుకోని పరిణామాలూ ఎదురవుతాయి. ఊహించని ఉత్పాతాలు కూడా మీదపడవచ్చు. అలాంటి సమయంలోనే, నిబ్బరంగా వ్యవహరించాలి. ఆ సంక్షోభాన్ని ఓ అవకాశంగా మలుచుకోవాలి. బాహుబలి విషయంలోనూ అదే జరిగింది. మొదట్లో 'బాహుబలి-2' ఆలోచన లేనేలేదు. తీరా చివరికొచ్చేసరికి మూడున్నరా, నాలుగు గంటల నిడివితో 'మహా'బలి తయారై కూర్చుంది. ఎక్కడా కోత పెట్టలేని పరిస్థితి. ఆ స్థానంలో మరొకరు ఉంటే.... అడ్డదిడ్డంగా కత్తెరవేసి, తలాతోకాలేని కథతో విడుదల చేసేవారు. అదే జరిగి ఉంటే, బాహుబలి ఓమోస్తరు సినిమాగా మిగిలిపోయేది. పార్ట్-2కు వెళ్లాలన్న దర్శక నిర్మాతల నిర్ణయం సాహసోపేతమైంది. దాంతోపాటే ఆర్థికంగానూ కలిసొచ్చింది. ఒకటిన్నర సినిమా ఖర్చుతో రెండు సినిమాలు సిద్ధమైపోయాయి. మేనేజ్‌మెంట్ పరిభాషలో ఇది 'వాల్యూ ఇన్నొవేషన్'. ఇక్కడో రిస్కు కూడా ఉంది. మొదటి భాగాన్ని చూసిన ప్రేక్షకుడు ఏ కాస్త పెదవి విరిచినా, రెండో భాగానికి నూకలు చెల్లినట్టే. మొదటి భాగం అద్భుతంగా ఉందని తీర్పు చెప్పినా కష్టమే. ఆ విజయంలోనే... 'రెండో భాగం ఇంతకు పదిరెట్లు బావుండాలి సుమా' అన్న హెచ్చరిక అంతర్లీనం. మొత్తానికి కత్తిమీద సామే. మేనేజ్‌మెంట్ పదకోశంలో 'ఎపిటైజర్ ఎఫెక్ట్' అనే మాట ఒకటుంది. ఏ విందుకు వెళ్లినా ముందు సూపు వడ్డిస్తారు. దీనివల్ల ఆకలి పెరుగుతుందని ఓ నమ్మకం. బాహుబలి-1 కూడా వేడివేడి చికెన్ సూపులానే పనిచేసింది. పార్ట్-2 పట్ల జనాల్లో ఆసక్తిని పెంచింది. ఉత్కంఠను అధికం చేసింది.

**ఛేంజ్ మేనేజ్‌మెంట్...**

'డిస్రప్ట్ యువర్‌సెల్ఫ్' ... అన్నది ఓ మేనేజ్‌మెంట్ విధానం. నిన్ను మరెవరో అధిగమించకుండా ఉండాలంటే, నిన్నునీవు అధిగమించాలి. నిన్ను ఎవరూ ఓడించకుండా ఉండాలంటే, నిన్ను నీవు ఓడించుకోవాలి. నీ వ్యవస్థను ఎవరూ విధ్వంసం చేయకుండా ఉండాలంటే ... ఆ పని నువ్వే చేయాలి. ఆ పాత శిథిలాల మీద కొత్త సౌధాన్ని నిర్మించాలి.

రాజమౌళి బృందం చేస్తున్నదీ అదే....

బాహుబలి-1తో ఓ సంచలనం సృష్టించింది.

బాహుబలి-2 తో దాన్ని తిరగరాయబోతోంది.

మనకు మనమే పోటీదారుగా ఉండటంలోని కిక్కే వేరు!

మహాత్ముడిలో జాతిపితనో, స్వాతంత్ర్య సమరయోధుడినో కాకుండా... ఓ మేనేజ్‌మెంట్ గురువును చూస్తుంది వ్యాపార ప్రపంచం. స్వాతంత్ర్యం ఎప్పుడొస్తుందో తెలియదు, ఎలా వస్తుందో తెలియదు. కానీ వచ్చితీరుతుందన్న నమ్మకాన్ని ప్రజల్లో కల్పించారాయన. సుదీర్ఘకాలం... సామాన్య కార్యకర్తల్ని లక్ష్యమే సర్వస్వమన్నట్టు ముందుకు నడిపించడం మామూలు విషయం కాదు. రేపు అన్నది బ్రహ్మాండంగా ఉండబోతోంది. ఆ ఫలితాలు ఇంత గొప్పగా రాబోతున్నాయి' అంటూ భవిష్యత్తును విజువలైజ్ చేయాలి నాయకుడనేవాడు. బాహుబలి నిస్సందేహంగా ఓ దీర్ఘకాలిక ప్రాజెక్టే. ఇంత కాలం ఒకే సినిమాకు పని చేయడమంటే... ప్రభాస్, రానా లాంటి ఎదుగుతున్న హీరోల చేతులు కట్టేసినట్టే. అయినా, ఎక్కడా ఆ పశ్చాత్తాపం కనిపించదు. 'చరిత్రలో నిలిచిపోయే సినిమాకు మేం పనిచేస్తున్నాం. ఆ సమయంలో మహా అయితే ఓ పది సినిమాలు తీసుండేవాళ్లం. తీసినా.....అవన్నీ ఒక ఎత్తు, బాహుబలి ఒక ఎత్తు' అంటూ ఆ యువ కథానాయకులు బల్లగుద్ది చెప్పగలిగేంత నమ్మకాన్నిచ్చారు రాజమౌళి. ఆ బృందస్ఫూర్తి 'ప్రీ రిలీజ్' ఫంక్షన్‌లోనూ కనిపించింది. చిట్టచివరి ఉద్యోగులతో సహా... పేరుపేరునా అందరికీ కృతజ్ఞతలు చెప్పారు. అది ఉత్తమ సంస్కారం. ఉత్తమ నాయకుడి లక్షణం కూడా. 'మనం' అన్న భావన వల్లే ఇన్నేళ్ల ప్రాజెక్టు ఓ పనిలా కాకుండా, ఓ ఉత్సవంలా జరిగింది. ఎవరూ గడియారాలు చూసుకోలేదు, క్యాలెండర్లను పట్టించుకోలేదు. పక్షికన్నునే చూస్తున్న పార్థుడి మనోస్థితి అది. మళ్లీ ఆ ఘనత నాయకత్వ బృందానిదే.

అనుకున్నట్టే వేయికోట్ల కలెక్షన్ సాధించవచ్చు. రానాకో, ప్రభాస్‌కో హాలీవుడ్‌లో అవకాశం రావచ్చు. రాజమౌళి ఎక్కడికో వెళ్లిపోవచ్చు. ఆస్కార్‌కూ ఆస్కారం ఉండవచ్చు.

అయినా సరే, ఆ విజయం విజయమే కాదు - ఈ చిన్న చొరవ లేకపోతే...

మైఖెల్ పోర్టర్ అనే నిపుణుడు 'షేర్డ్ వాల్యూ' సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఎంత గొప్ప ఆవిష్కరణ అయినా, ఎంత టెక్నాలజీ ఉన్నా... సమాజాన్ని విస్మరిస్తే, వాటాదారులకో యజమానులకో మాత్రమే కాసులు కురిపిస్తే అది అసంపూర్ణమే. జనానికి కూడా ఎంతోకొంత మంచి చేయాలి. బాహుబలి బృందం 'ఫ్యూయల్ ఎ డ్రీమ్' అనే క్రౌడ్ ఫండింగ్ సంస్థతో కలసి పనిచేస్తోంది. ఈ వేదిక ద్వారా .. ప్రాణాంతక వ్యాధులతో బాధపడుతున్న పిల్లల చికిత్సకు తమవంతు సాయం చేసినవారికి ప్రభాస్, రానా ఆటోగ్రాఫ్ చేసిన టీషర్టులు అందుతాయి. సినిమా టికెట్లూ బహుమతిగా ఇస్తారు. అంత ఒత్తిడిలోనూ మంచి నిర్ణయం తీసుకుంది బాహుబలి బృందం!

**- సండే డెస్క్**












# మిక్చర్ పొట్లం

బొమ్మలు : **చారి పి.యస్.**

## సరైనోడు

"నెమ్మదిగా నడిపే డ్రైవరు కావాలన్నావు కదా .. ఇదిగో తీసుకొచ్చాను" చెప్పాడు మిత్రుడు సుబ్బారావు.



"థాంక్యూ రా .. గతంలో ఏ వెహికల్ నడిపేవాడివోయ్?" అడిగాడు అప్పారావు డ్రైవరు వంక చూస్తూ.

"రోడ్ రోలరండి" చెప్పాడు కొత్త డ్రైవరు.

## సరే గురువుగారూ

"కట్టుకున్నదాన్ని జాగ్రత్తగా చూసుకో నాయనా" బోధించాడు గురువు.

"అలాగేనండి" - కట్టుకున్న లుంగీని, విప్పిన తర్వాత మడతపెట్టి బీరువాలో దాచాడు శిష్యుడు.

## ఫలించనున్న జోస్యం

"నేనొకవేళ చనిపోతే .." దగ్గుతూ పొలమారాడు రోగిష్టి జోగినాథం.

"అంతమాటనకండి .. నేనూ మీతో పాటే .." అంది ఆండాళ్లు కళ్లొత్తుకుంటూ.

"బతికున్నా, చచ్చినా దురదృష్టం నీ వెంటే ఉంటుందని జ్యోతిష్కుడు ఎప్పుడో చెప్పాడు" నీరసంగా పలికాడు జోగినాథం.



## రివర్స్‌లో చూపించు

"ఈ సోఫా చూడండి. పగలు సోఫాలా, రాత్రి మంచంలా ఉపయోగపడుతుంది" చెప్పాడు సేల్స్‌మ్యాన్.

"అబ్బే .. లాభం లేదు. రాత్రి సోఫాలా, పగలు మంచంలా ఉండేది చూపించు" ఆవులిస్తూ చెప్పాడు శేషావతారం.

## అది మాత్రం కుదరదు!

తల్లితో ప్రేమగా మాట్లాడాలి.

తండ్రిదో మర్యాదగా మాట్లాడాలి.

అన్నదమ్ములతో అభిమానంగా మాట్లాడాలి.

గురువులతో గౌరవంగా మాట్లాడాలి.

మిత్రులతో మనస్ఫూర్తిగా మాట్లాడాలి.

బామ్మర్దులతో కాస్త వెటకారంగా మాట్లాడాలి.

భార్యతో ....

అంత సీన్ లేదు - ఆవిడ చెప్పింది వినాలి.



## మర్చిపోలేని రూపం



"ఎటు వైపు చూసినా నీ మొహమే కనిపిస్తోంది రాజా ..." ఫోన్‌లో చెప్పింది నీలవేణి.

"అంటే నీ మనసులో నేనున్నానన్నమాట. లవ్ యూ డియర్ ... ఇంతకీ ఎక్కడున్నావు" గోముగా అడిగాడు రాజా.

"జూలో .. డియర్" అంతే గోముగా చెప్పింది నీలవేణి.

# తొందరగా బోర్ ఫీలవుతా!

'అందాల రాక్షసి'తో తెలుగు తెరకు పరిచయమైన **లావణ్య త్రిపాఠి** 'దూసుకెళ్తా', 'భలే..భలే.. మగాడివోయ్', 'సోగ్గాడే చిన్నినాయనా'లతో స్టార్ హీరోయిన్‌గా సెటిలయ్యింది. అచ్చతెలుగు అమ్మాయిలా కనిపించే లావణ్యది డెహ్రాడూన్. ఆమె 'మిస్ ఉత్తరాఖండ్' కూడా. "రెగ్యులర్ జాబ్స్ చేయడమంటే యమాబోర్. అందుకే సృజనాత్మకరంగం వైపు వచ్చాను" అంటూ లావణ్య చెబుతున్న విశేషాలివి...



'ఎప్పుడు చూసినా చలాకీగా, రిఫ్రెషింగ్‌గా ఎలా ఉంటావు' అని నన్ను చాలామంది అడుగుతుంటారు. ఆ సీక్రెట్ తెలుసుకోవాలంటే మా ఊరు గురించి తెలుసుకోవాలి. మాది ఉత్తరాఖండ్‌లోని కొండ ప్రాంతమైన డెహ్రాడూన్. చుట్టూ కొండలు, ఆ కొండలను ఆనుకుని కదిలే మేఘాలు... ఊరు ఊరంతా మంచు దుప్పటి కప్పుకుని అద్భుతంగా ఉంటుంది. మా ఇల్లు ఒక కొండ మీద ఉంటుంది. ఉదయం నిద్ర లేవగానే కిటికీ తెరిస్తే చాలు అద్భుతమైన ప్రకృతి దృశ్యాలు ఎన్నో కనిపిస్తాయి. దానికి తోడు దగ్గర్లోనే రైల్వే ట్రాక్. ఆ ట్రాక్ మీద నుంచి రైలు వెళ్తున్న శబ్దం రిథమిక్‌గా వినిపిస్తుంది. మా అమ్మ పెయింటర్... మా అక్క కథక్ డ్యాన్సర్... ఒక్కసారి మా ఇంటి సీన్ ఊహించుకుంటే మీకే అర్థమవుతుంది, చిన్నప్పుడు నేను ఎలాంటి వాతావరణంలో పెరిగానో.

నిజానికి నేను అయోధ్యలో (అమ్మ ఊరు) పుట్టాను. అప్పటికే లాయర్‌గా ప్రాక్టీస్ చేస్తున్న నాన్న (సొంతూరు ఫైజాబాద్) డెహ్రాడూన్‌లో సెటిలవ్వడంతో అదే మా సొంతూరు అయ్యింది. అక్కడి ప్రసిద్ధ మార్షల్ స్కూలులో చదువుకున్నా. నాకొక అక్క, అన్నయ్య ఉన్నారు. వారితో కలిసి స్కూలుకెళ్లేదాన్ని. నా అల్లరి భరించడం వాళ్ల వల్ల అయ్యేది కాదు. మా అమ్మ హిందీ టీచర్‌గా పనిచేసేది. పెయింటింగ్స్ బాగా వేస్తుంది. మా అక్కకు డాన్స్ అంటే చాలా ఇష్టం. కథక్ నేర్చుకుని ఇంట్లో ప్రాక్టీస్ చేస్తుంటే నేను కూడా అప్పుడప్పుడు ఆ అడుగుల్లో అడుగులు వేసేదాన్ని. ఆ విధంగా నాకు తెలియకుండానే సృజనాత్మక కళల వైపు ఆకర్షితురాలినయ్యా.

**మిస్ ఉత్తరాఖండ్‌గా...**

నేను ప్లస్ టు చదువుతున్నప్పుడు 'మిస్ ఉత్తరాఖండ్' పోటీల ప్రకటన చూశాను. మొదటిసారిగా అమ్మ దగ్గర 500 రూపాయలు అడిగి తీసుకుని, ఎంట్రీ ఫారమ్ నింపి, దానికి కొన్ని ఫోటోలు జతచేసి పంపించాను. ఆశ్చర్యంగా ప్రైమరీ లెవల్లో ఎంపికయ్యాను. ఆ తర్వాత కొన్ని విభాగాల్లో అందాలపోటీ నిర్వాహకులు శిక్షణ ఇచ్చారు. ఫైనల్స్ రోజు మా నాన్నను ఆ ఫంక్షన్‌కు రమ్మంటే రానన్నారు. 'అందులో ఓడిపోతే నువ్వు ఏడుస్తావురా... నీ ఏడుపు మొహాన్ని నేను చూడలేను" అన్నారు. అయినా సరే పట్టుబట్టి మా కుటుంబాన్నంతా తీసుకెళ్లాను. వేదికపై అన్ని రౌండ్లలో కాన్ఫిడెంట్‌గా ఉండటంతో 'మిస్ ఉత్తరాఖండ్' (2006) కిరీటం గెలుచుకోగలిగాను. అప్పుడే మావాళ్లకు నాపై విపరీతమైన నమ్మకం ఏర్పడింది. నాక్కూడా మొదటిసారిగా 'ఫేమ్'లోని టేస్ట్ దొరికింది. స్థానిక పత్రికల నిండా నా ఫోటోలే. ఎట్టి పరిస్థితుల్లోనూ ఉద్యోగం చేయకూడదని, సృజనాత్మక రంగాలవైపే వెళ్లాలని ఆ క్షణంలోనే గట్టిగా నిర్ణయించుకున్నా. మొదట్లో ఫ్యాషన్ డిజైనర్ అవ్వాలనే కోరిక ఉండేది. కానీ 'మిస్ ఉత్తరాఖండ్' అయ్యాక నా ఆలోచనలు యు టర్న్ తీసుకుని మోడల్‌గా మారాలనుకున్నా. అందుకే ప్లస్ టూ పూర్తవ్వగానే ఇంట్లో వాళ్లను ఒప్పించి ముంబయికి చేరుకున్నా.

**చదువుకుంటూనే మోడలింగ్...**

ముంబయికి బయలుదేరేముందు మా నాన్న ఒక కండీషన్ పెట్టారు. 'నీకిష్టమైన ఫీల్డు ఎంచుకో,

కానీ చదువును మాత్రం నిర్లక్ష్యం చేయొద్దు' అన్నారు. అందుకే 'రిషీ దయారామ్ నేషనల్ కాలేజీ'లో బి.ఎ. ఎకనామిక్స్‌లో చేరాను. అంధేరీలో ఓ ఫ్లాట్ అద్దెకు తీసుకుని ఒకవైపు డిగ్రీ చేస్తూనే మరోవైపు మోడల్‌గా ప్రయత్నాలు మొదలెట్టాను. నేను ఏ విషయంలోనైనా ఆచితూచి అడుగులేస్తా. అందుకే పది అవకాశాలు వస్తే వాటిలో ఏ రెండో మూడో అంగీకరించేదాన్ని. దానివల్ల నా కెరీర్‌కు మేలే జరిగింది.

ఫెయిర్ అండ్ లవ్లీ, మారుతీ ఆల్టో, పోలో, కొటక్ మహీంద్రా వంటి చాలా ప్రకటనల్లో నటించా. నాలో ఉన్న ప్లస్‌పాయింట్, మైనస్‌పాయింట్ ఒకటే... అదేమిటంటే నేను తొందరగా బోర్ ఫీలవుతా. మోడలింగ్‌లో ఒకేటైపు పాత్రలు, ఒకే టైపు పని చేసీ చేసీ బోర్ కొట్టింది. అందుకే 'మోడలింగ్ ఇక చాలు' అనుకుంటున్న సమయంలో నా ఫ్రెండొకరు 'అర్జంట్‌గా మేకప్ లేకుండా రమ్మ'ని కబురు చేసింది.

తీరా అక్కడికి వెళ్తే 'ఒక తెలుగు సినిమాకు హీరోయిన్ కావాలంటున్నార'ని చెప్పింది. అక్కడ క్యాజువల్‌గా ఒక వీడియో షూట్ చేసి, ఆ తర్వాత నేను సెలెక్ట్ అయ్యానని చెప్పారు. ఆ విధంగా 'అందాల రాక్షసి' సినిమాతో తెలుగుతెరకు పరిచయమయ్యాను. సాధారణంగా తొలిసినిమాలో ఎవరైనా గ్లామరస్‌గా కనిపించాలనుకుంటారు. నాక్కూడా అందంగా డ్రెస్సప్ అవడమంటే ఇష్టం. కానీ ఆ సినిమాలో 'మిథున' పాత్ర చాలా బరువైంది. పైగా నేను ఆశించినట్టుగా గ్లామర్ పాత్రేం కాదు. దాంతో కొంచెం డిసప్పాయింటయ్యా. కానీ చిన్న వయసులోనే అనేక భావోద్వేగాలను పలికించే అవకాశం ఆ పాత్ర ద్వారా నాకు కలిగింది. యేడాది పాటు షూటింగ్ జరిగింది. ఆ సినిమాలో నేను అందరికీ తెగ నచ్చేశా. నన్ను అందరూ అచ్చ తెలుగమ్మాయి అనుకున్నారు.

'మిథున' పాత్ర మూడ్ నుంచి బయటపడేందుకు తిరిగి మా ఊరికి వెళ్లిపోయా. ఎనిమిది నెలల తర్వాత 'దూసుకెళ్తా' ఒప్పుకున్నా. ఆ సినిమా కూడా హిట్టవ్వడంతో అవకాశాలు నన్ను వెతుక్కుంటూ వచ్చాయి. 'భలే భలే మగాడివోయ్', 'సోగ్గాడే చిన్ని నాయనా', 'లచ్చిందేవికి ఓ లెక్కుంది', 'శ్రీరస్తు శుభమస్తు'లతో పాటు ఇటీవల విడుదలైన 'మిస్టర్'లో కూడా నటించాను. 'సోగ్గాడే చిన్నినాయనా' సినిమా డెహ్రాడూన్‌లో విడుదలైనప్పుడు మా ఇంటిల్లిపాదీ ఆ సినిమా చూశారు. ఇప్పటికీ హిందీలోకి అనువాదమైన నా సినిమాలు టీవీలో వస్తుంటే ఫ్రెండ్స్ ఫోన్ చేస్తుంటారు.

**నటనలో ఓనమాలు అక్కడే...**

నటనలో నేను ఓనమాలు దిద్దుకున్నది డెహ్రాడూన్‌లోనే అని చెప్పాలి. అక్కడి 'అవికల్ థియేటర్ ఆర్ట్స్'లో నటనలో శిక్షణ ఇచ్చేవారు. అందులో స్వల్పకాలిక కోర్సు చేశాను. ముంబయికి చెందిన ప్రముఖ నటగురువు అలోక్ పాఠాలు బోధించేవారు. నేను అప్పటికే మోడల్‌గా పేరు సంపాదించుకున్నప్పటికీ అక్కడ మాత్రం ఒక విద్యార్థిలాగే ఉండేదాన్ని. పొద్దున్నే నటనాలయానికి వెళ్లగానే స్టేజీ శుభ్రం చేసేదాన్ని. సహ నటీనటులకు టీలు కూడా సప్లయ్ చేసేదాన్ని. అక్కడ అంతా విద్యార్థులే కాబట్టి అన్ని పనుల్లోనూ అందరూ ఇన్వాల్వ్ అయ్యేవారు. స్టేజీ మీద రకరకాల పాత్రలు వేసేదాన్ని. పిచ్చిదాని పాత్ర వేయాలంటే ఇంటి దగ్గరి నుంచే పిచ్చిదానిలా తయారై టూవీలర్ నడుపుకుంటూ వెళ్లేదాన్ని. అవన్నీ ఇప్పుడు తలుచుకుంటే నవ్వొస్తుంది.

ప్రస్తుతం తెలుగులో మంచి అవకాశాలొస్తున్నాయి. హీరోయిన్‌గా ప్రతీ క్షణాన్ని ఎంజాయ్ చేస్తున్నా. నటనను కెరీర్‌గా ఎంచుకోవడం పట్ల మా ఇంట్లో వాళ్లు కూడా హ్యాపీగా ఉన్నారు. డబ్బుతో పాటు, పేరుప్రఖ్యాతులు కూడా వస్తున్నాయి కదా. నటనకు భాష ఎప్పుడూ అడ్డంకి కాదు. అందుకే ఒక సినిమాకు సైన్ చేసేప్పుడు అది తెలుగా, తమిళా, హిందీనా అనే లెక్కలు వేసుకోను. ఒక నటిగా నేను నీటిలాంటిదాన్ని. ప్రవహిస్తూ ఉండాల్సిందే.

● చల్లా శ్రీనివాస్


అమ్మ, అక్కతో...




- ఏ.ఆర్.రెహమాన్ సంగీతమంటే చాలా ఇష్టం. ఎప్పుడూ వింటుంటాను.
- ఫ్యామిలీ డ్రామాల్లో నటిస్తున్నప్పటికీ నాకు పర్సనల్‌గా హారర్, థ్రిల్లర్స్ అంటే ఇష్టం.
- శ్రీదేవి, మాధురీ దీక్షిత్ ఆల్‌టైమ్ ఫేవరెట్స్.
- ఆన్‌లైన్ షాపింగ్ ఎక్కువగా చేస్తుంటా. ఈ మధ్య ఆన్‌లైన్‌లో రెండు హ్యాండ్‌మేడ్ శారీస్ కొన్నా.
- వంట బాగా వచ్చు. ఇండియన్, చైనీస్ వంటకాలతో పాటు కావాలంటే పానీపూరీ కూడా చేస్తా.
- నా సిస్టర్ శివానీది లవ్ మ్యారేజ్. తను ప్రస్తుతం ఉత్తరాఖండ్‌లో అసిస్టెంట్ కమర్షియల్ టాక్స్ ఆఫీసర్‌గా ఉద్యోగం చేస్తోంది. బ్రదర్ బాలీవుడ్‌లో అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేస్తున్నాడు.
- బ్రిజ్ మహారాజ్ శిష్యురాలు విజయశ్రీ దగ్గర నేను కథక్ నేర్చుకున్నా.
- ఫ్రెండ్స్ ఎక్కువే. నా స్కూల్‌మేట్స్ నేహా, స్వాతి, ప్రాప్తి, షగున్, ప్రశాంత్‌లు ఇప్పటికీ రెగ్యులర్‌గా కలుస్తుంటారు.
- 'బాహుబలి'లో రాజమౌళిగారు ఎంత చిన్న క్యారెక్టరిచ్చినా చేసేదాన్ని. 'బాహుబలి-2' కోసం నేను కూడా ఎగ్జయిటింగ్‌గా ఎదురుచూస్తున్నా.

# cyber క్రైమ్

**"ఏంటీ... సమియాకు క్యాన్సరా?" ఆశ్చర్యంగా అంది ప్రియ.**

**"అవునే... ఫేస్‌బుక్‌లో ఈ పోస్ట్ చూడు... హాస్పిటల్ రిపోర్ట్స్ కూడా ఉన్నాయి..." అంటూ తన ఫ్రెండ్‌కు వాటిని చూపించింది నవ్య.**

**"పాపం... దానికి ఇంత చిన్న వయసులోనే క్యాన్సరా... అన్‌బిలీవబుల్..." అంటూ తలపట్టుకుంది ప్రియ.**

**"హాస్పిటల్ ఖర్చులకు సాయం కూడా అర్థిస్తోంది. వెంటనే తను ఇచ్చిన అకౌంట్‌కు ఎంతో కొంత అమౌంట్ ట్రాన్స్‌ఫర్ చేద్దాం..."**

## హెల్ప్ మీ ప్లీజ్...

"ఓకే. మన ఫ్రెండ్స్‌కు కూడా దీన్ని ట్యాగ్ చేద్దాం. ఎవరెక్కడున్నా విషయం తెలుసుకుని వీలైనంత సాయం చేస్తారు కదా..."

"గుడ్ ఐడియా..." అంటూ ఫేస్‌బుక్‌లోని ఆ మెసేజ్‌ను మిగతావారికి ఫార్వర్డ్ చేశారు. వెంటనే చెరో లక్ష రూపాయలు సమియా ఇచ్చిన అకౌంట్ నంబర్‌కు ట్రాన్స్‌ఫర్ చేశారు.

ప్రియ, నవ్య... అమెరికాలోని ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీలో పనిచేస్తున్నారు. వారిద్దరూ ఒకప్పుడు సమియా క్లాస్‌మేట్స్.

• • •

"ఎక్స్‌క్యూజ్ మీ... పేషంట్ పేరు సమియా... మొన్నే మీ హాస్పిటల్‌లో క్యాన్సర్‌కు సర్జరీ చేయించుకుంది. తను ఏ రూమ్‌లో ఉందో చెప్పగలరా?" రిసెప్షన్‌లో ఎంక్వయిరీ చేసింది ఫాతిమా.

"పేషంట్‌కు మీరేమవుతారు?..."

"మేమిద్దరం సమియా స్నేహితులం. సౌదీ నుంచి వచ్చాం. ఫేస్‌బుక్‌లో విషయం తెలుసుకుని ఉండబట్టలేక వచ్చేశాం..."

"జస్ట్ ఎ మినిట్..." అంటూ ఇన్‌పేషంట్స్ లిస్ట్ చెక్ చేసింది.

పేషంట్ పేరు మ్యాచ్ కాలేదు. మరోసారి చెక్ చేసింది.

"మేడమ్. సమియా పేరుతో ఎవరూ లేరు..."

"అదేంటీ... ఫేస్‌బుక్‌లో తన కేస్ షీట్స్ కూడా పెట్టింది కదా..." అంటూ ఫేస్‌బుక్‌లోని ఆ కాపీలను చూపించింది ఫాతిమా.

ఆ కేస్‌షీట్స్‌ను చెక్ చేసిన హాస్పిటల్ సిబ్బందికి అసలు విషయం అర్థమైంది.

• • •

బంజారాహిల్స్ పోలీస్‌స్టేషన్...

ఫాతిమాతో పాటు ఆసుపత్రి యాజమాన్యం కూడా ఇచ్చిన ఫిర్యాదుతో ఎంక్వయిరీ మొదలెట్టిన పోలీసులకు ఫేస్‌బుక్‌ను అడ్డుపెట్టుకుని సమియా చేసిన మోసం తేటతెల్లమయ్యింది.

"ఒకటి కాదు రెండు కాదు... సమియా వసూలు చేసిన మొత్తం నలభై లక్షల రూపాయలకు పైగా అని తేలింది..." అన్నాడు క్రైమ్ ఇన్‌స్పెక్టర్.

"అవున్సార్... స్నేహితులతో పాటు, పలు స్వచ్ఛంద సంస్థలు, సానుభూతిపరులు కూడా ఆమె ఫేస్‌బుక్‌లో ఇచ్చిన అకౌంట్లోకి ఎంతో కొంత ట్రాన్స్‌ఫర్ చేశారు. సమియా అకౌంట్ వివరాలు బ్యాంకు నుంచి సేకరించాం. కానీ అప్పటికే ఆమె ఆ డబ్బు విత్‌డ్రా చేసుకుంది" అన్నాడు కేసు దర్యాప్తు చేస్తున్న ఎస్సై.

"ఇంతకీ ఇలా మోసం చేయవచ్చనే ఐడియా ఆమెకు ఎలా వచ్చిందో?"

"సమియాకు క్యాన్సర్ లేదు. ఆమె తండ్రికి ఉంది. ఆయన్ని బంజారాహిల్స్‌లోని ఓ ఆసుపత్రికి తీసుకెళ్లింది. అక్కడికి వెళ్లిన తర్వాత క్యాన్సర్ బాధితులకు సాయం చేసేందుకు కొన్ని వెబ్‌సైట్లు ఉన్నాయని తెలుసుకుంది. వెంటనే తనే క్యాన్సర్ పేషెంట్‌గా అవతారమెత్తి డబ్బు సంపాదించాలనుకుంది. తండ్రి వ్యాధి విషయమై అక్కడి వైద్యులతో మాట్లాడుతున్నప్పుడు వీడియోలు తీసింది. ప్రిస్క్రిప్షన్‌పై ఉన్న తండ్రిపేరు తీసేసి తన పేరు చేర్చింది. వాటిని ఫేస్‌బుక్‌లో అప్‌లోడ్ చేస్తూ తన దయనీయ పరిస్థితిని వివరించింది. సాయం చేయాలనుకునేవారి కోసం బ్యాంకు అకౌంట్ నంబరు కూడా ఇచ్చింది. దాంతో చాలామంది ఆమె పరిస్థితికి జాలిపడి సాయం చేశారు. మొత్తానికి క్యాన్సర్ పేరిట అందరికీ టోకరా ఇచ్చిందన్నమాట..." అంటూ పరారీలో ఉన్న సమియా కోసం గాలింపు చర్యలు మొదలెట్టారు ఎస్సై.

ఫేస్‌బుక్‌లో అప్పుడప్పుడు ఇలాంటి ఫేక్ రిక్వెస్ట్‌లు కూడా వస్తున్నాయనే విషయాన్ని అందరూ గుర్తించి అప్రమత్తంగా ఉండాలంటున్నారు పోలీసులు.

• **వేముల సత్యనారాయణ,**
99854 88800



## ట్రెండ్స్

# వీనులకు 'నూలు' అందం!



**లో**లకులు, బుట్టలు, జుంకీలు... పేరేదైనా అన్నీ కర్ణాభరణాలే. అయితే అవన్నీ లోహాలతో చేసినవి. కాకపోతే వీటిని అప్పుడప్పుడూ పెట్టుకోవాలి గానీ రోజూ ధరించలేరు. ఆడవాళ్లు అసలే మ్యాచింగ్ ప్రియులు. గోళ్ల రంగు దగ్గర నుంచి, దుస్తుల నుంచి, లోలకుల వరకూ అన్నీ ఏకరూపంగా ఉండాలి. ఆ లోటును భర్తీ చేస్తూ తక్కువ ఖరీదులో ప్లాస్టిక్‌తో చేసిన చెవి రింగులు వచ్చాయి. ఇప్పుడు వాటినన్నింటినీ తోసిరాజని సరికొత్త నూలు ఆభరణాలు అతివలను ఆకట్టుకుంటున్నాయి. వివిధ ఆకారాల్లో, వివిధ డిజైన్లలో చూడగానే 'వావ్' అనిపిస్తున్నాయి. ఇవి మన రాష్ట్రానికో, మనదేశానికో పరిమితమైనవి కాదు సుమా! ఆఫ్రికా నుంచి అమెరికా వరకూ, ఆస్ట్రేలియా నుంచి ఐరోపా వరకూ ఈ నూలు కర్ణాభరణాలు ట్రెండింగ్‌లో ఉన్నాయి.




# ట్రెండీ హ్యాండ్‌బ్యాగ్స్

'కొత్తొక వింత... పాతొక రోత' అనే సామెతను ఎవరు పుట్టించారో గానీ, నేటితరం దాన్నే తారకమంత్రం చేసుకుంది. నఖశిఖ పర్యంతం కొత్తగా కనిపించడమే కాదు... చేతిసంచిలోనూ తన ప్రత్యేకత చూపిస్తోంది. ఆ స్టైల్ స్టేట్‌మెంట్లపై మీరూ ఓ లుక్కేయండి. నచ్చితే మీ హ్యాండ్‌బ్యాగులనూ మార్చేయండి.

# చీరకు కొత్తజన్మ





**ప**దిలంగా దాచుకున్న పట్టుచీర... బీరువాలోంచి బయటకు వచ్చే సందర్భాలు చాలా తక్కువ. 'వాటిని కట్టుకోలేకపోతున్నాం, దాచుకోలేకపోతున్నాం' అనుకునేవాళ్లు చాలామందే ఉంటారు. అదే చీర కూతురికి కుర్తీగా మారి కొత్తగా పలకరిస్తుంటే బాగుంటుంది కదా! ఈ ఒక్క ఆలోచనతో అనేక పట్టుచీరలు బీరువాల నుంచి బయటకు వచ్చి ఫ్యాషన్ డిజైనర్ల చేతుల్లో కుర్తీలుగా, అనార్కలి డ్రెసెస్‌గా, లంగాలుగా, లెహంగాలుగా, శారీ డ్రెసెస్‌గా కొత్త అందాలు సంతరించుకుంటున్నాయి.

# అపూర్వమీ నఖ సౌందర్యం!

సృజనశీలికి వస్తువుతో పనిలేదు. ఆలోచనే అతడి ఆయుధం. ఐడియా రావడమే ఆలస్యం ఓ అందమైన కళాఖండం మన ముందు నిలుస్తుంది. అందుకు తార్కాణాలు ఇక్కడ కనిపిస్తున్న అందాలొలికే ఈ వేలిగోళ్లు. ఇలా మీ గోళ్లను కూడా అలంకరించుకోవాలంటే ఏ బ్యూటీషియన్ దగ్గరికో పరిగెత్తనక్కర్లేదు. కొంచెం ఓపిక చేసుకోండి. వివిధ రంగుల నెయిల్ పాలిష్‌తో పాటు ఐషాడో కూడా ఉపయోగించవచ్చు. గోరుపై చుక్కలు పెట్టుకోవాలంటే బాబీ పిన్ను ఉపయోగించవచ్చు. సగం గోరుకే రంగు వేసుకోవాలనుకుంటే ఐమూలగా టేప్ అంటించారనుకోండి అదో డిజైన్ అయిపోతుంది. ఇలాంటి చిట్కాలతో ఎన్నో కొత్త స్టైల్స్ ట్రై చేయొచ్చు.



# టీ హబ్!

**కమ్మని కాఫీ కోసం.... కాఫీడేలూ, కాఫీ హౌస్‌లూ ఉన్నప్పుడు... గరమ్ చాయ్ కోసం ప్రత్యేకమైన అడ్డాలు ఎందుకు ఉండకూడదు? రంగులో, రుచిలో, చిక్కదనంలో... ఎందులో మాత్రం చాయ్ తక్కువ? ఆమాటకొస్తే పిసరంత ఎక్కువే. తేయాకులోని ఔషధగుణాలూ ఇప్పుడిప్పుడే బయటపడుతున్నాయి. అందులోనూ భారతీయులకు టీ మీదున్న మక్కువే వేరు - మరో'టీ', ఇంకో'టీ'... అంటూ మొహమాటం లేకుండా కప్పు మీద కప్పు ఖాళీ చేసేస్తారు. కాబట్టే కొందరు చాయ్ కప్పులో గొప్ప వ్యాపారముందని గుర్తించారు, 'టీ ఎంట్రప్రెన్యూర్స్' అవతారం ఎత్తేశారు.**

## ఏక్‌చాయ్... దో బిస్కెట్!



వేడివేడి చాయ్‌తో కరకరలాడే బిస్కెట్లు సూపర్ కాంబినేషన్. ఆ టేస్ట్ ఉన్నవారికి 'చాయ్ పాయింట్' తిరుగులేని అడ్డా. 'చాయ్ ఆన్ కాల్' ద్వారా ఇష్టమైన చాయ్, నచ్చిన స్నాక్స్ ఇంటికే తెప్పించుకోవచ్చు. బెంగుళూరు, ఢిల్లీ నగరాల్లో ఉండే ఈ చాయ్ పాయింట్ వ్యవస్థాపకుడు అములిక్ సింగ్ బిజ్రల్.

## చాయ్ వరల్డ్

టీ బాక్స్.... ఓ చాయ్ ప్రపంచం. టీ కప్పులూ, సాసర్లూ, ట్రేలూ ఇక్కడ కొనుక్కోవచ్చు. రకరకాల టీ బ్యాగులు కూడా అందుబాటులో ఉంటాయి. అరుదైన టీపొడులు గిఫ్ట్ ప్యాక్ రూపంలోనూ లభిస్తాయి. మధ్యవర్తులెవరూ లేకుండా నేరుగా తేయాకు తోటల నుంచి వినియోగదారుడికి తాజా 'టీ'ని చేరుస్తోంది టీ బాక్స్. ఇ-కామర్స్ ద్వారా ఆన్‌లైన్‌లో టీ అమ్మకాలు మొదలుపెట్టిన టీ బాక్స్, దాదాపు 94 దేశాల ప్రజలకు 'కడక్ చాయ్' రుచిని పరిచయం చేస్తోంది. కౌషల్ దుగర్ 'టీ బాక్స్' ను స్థాపించారు. ఇందులో రతన్ టాటా కూడా పెట్టుబడులు పెట్టారు. ఆన్‌లైన్‌లో 'టీ' బుక్ చేసే వారికి ప్రతి ఆర్డర్‌పై 3 టీ శాంపిల్స్ ఉచితంగా ఇస్తోంది.







## బండిచాయ్... భలే మజా!

చాయ్ తేలా... పేరుకు తగ్గట్టుగానే తోపుడు బండిలా ఉంటుంది. చాయ్‌తేలాలో.... తాజాగా తెంపితెచ్చిన తేయాకుతో వేడివేడిగా చాయ్ కాచి ఇస్తారు. ఐటీ పార్కులూ కాలేజీలే 'చాయ్ తేలా' లక్ష్యం. కావాలంటే, పార్సిల్ చేయించుకుని ఇంటికో ఆఫీసుకో తీసుకెళ్లొచ్చు. ఈ స్టార్టప్ వాడిపడేయడానికి వీలున్న... టెట్రా ప్యాక్ ఫ్లాస్క్‌లను సొంతంగా డిజైన్ చేసుకుంది. పంకజ్, నితిన్.... మరో 8 మందితో కలిసి చాయ్ తేలాను ఏర్పాటుచేశారు.

## హాయిహాయిగా... చాయి తాగుతూ

'మేం చాయ్ మాత్రమే ఇవ్వం. దాంతోపాటే అనుభూతినీ అందిస్తాం. కాఫీలో మహా అయితే ఒకట్రెండు రుచులే. అదే చాయ్‌లో అయితేనా బోల్డన్ని' అంటారు 'టీ ట్రయల్స్' వ్యవస్థాపకుడు ఉదయ్ మాథూర్. ప్రపంచ వ్యాప్తంగా దొరికే వైవిధ్యమైన చాయ్ రుచులను ఆస్వాదించాలనుకుంటే, 'ట్రీ ట్రయల్స్' కు వెళ్లాల్సిందే. హైదరాబాద్‌లోని గచ్చిబౌలి సహా చాలా నగరాల్లో దీనికి శాఖలున్నాయి. గ్రీన్ టీ, బ్లాక్ టీ, హెర్బల్ టీ వంటి సాదాసీదా రకాలు మొదలుకొని వైట్ టీ, ఓలాంగ్ టీ వగైరా అరుదైన రుచులనూ ఆస్వాదించవచ్చు.





## మట్టికప్పులో... మహారుచి!

మట్టి కప్పుల్లో చాయ్ రుచి చూడాలంటే 'చైసా' కెఫేకి వెళ్లాల్సిందే. కప్పులు మాత్రమే కాదు, ఇంటీరియర్స్ కూడా ప్రత్యేకంగా ఉంటాయి. గోడలకు వేలాడుతున్న పెయింటింగ్స్‌ను చూస్తే... ఏ ఆర్ట్ గ్యాలరీలోనో కూర్చుని టీ తాగుతున్న అనుభూతి కలుగుతుంది. చాయ్‌తో పాటు వడాపావ్, చాట్ వంటివి కూడా ఉంటాయిక్కడ. చైసా వ్యవస్థాపకుడు రాహుల్ ముంద్రా.



## పక్కాలోకల్... చాయ్‌వాలా

ఏ ఇరానీ హోటల్‌కో వెళ్లినప్పుడు 'చోటూ ఏక్ చాయ్' అంటూ ఆర్డరిస్తాం. ఊతపదమైపోయిన ఆ మాటను తీసుకుని 'చోటూ చాయ్ వాలా' అనే ఆన్‌లైన్ టీ బుకింగ్ స్టాల్‌ను నడుపుతోంది జిపో.కామ్. ఇ-కామర్స్ వెబ్‌సైట్ బిల్డింగ్ ప్లాట్‌ఫాం అయిన జిపో.కామ్ (వ్యవస్థాపకుడు- నితిన్ పుస్ర్వాని) ముంబయిలోని చాయ్‌వాలాలను ఏకం చేసి 'కట్టింగ్ చాయ్' అనే అక్కడి స్పెషల్ చాయ్‌ని ఆన్‌లైన్‌లో అమ్ముతోంది. అయినా, చాయ్ మీద మక్కువ ఒక కప్పుతో తీరేదా, ఒక సిప్పుతో ఆగేదా! అందుకే, ఓ డెబ్భై రూపాయలు చెల్లించి 7 రోజులకు చాయ్ బుక్ చేసుకోవచ్చు. నెల రోజులకూ బుక్ చేసుకునే వెసులుబాటూ ఉంది.





## ఆన్‌లైన్‌లోనూ... వేడివేడిగా!

ఆన్‌లైన్‌లో బిర్యానీ ఆర్డరు ఇచ్చినప్పుడు, ఆన్‌లైన్‌లోనే పిజ్జాలూ బర్గర్లూ తెప్పించుకున్నప్పుడు... ఓ కప్పు చాయ్‌ని మాత్రం గడప దాకా ఎందుకు రప్పించుకోలేం? 'చాయోస్' ఆ ఛాయిస్ ఇస్తోంది. అదీ రకరకాల రుచులతో. అల్లం టీ, యాలకులూ శొంఠీ దట్టించి చేసే... ఘాటైన మసాలా టీ మనందరికీ తెలుసు. కానీ, పచ్చిమిర్చితోనూ కారంకారంగా చాయ్ పెట్టొచ్చన్న రహస్యం చాయోస్‌కే తెలుసు. ఢిల్లీ, ముంబాయి నగరాల్లో 'చాయ్ ఆన్ డిమాండ్' సర్వీసును ప్రారంభించి మొబైల్ - ఆన్‌లైన్ - ఫోన్ బుకింగ్ ద్వారా రోజుకు వేయికప్పుల టీని వినియోగదారుల ఇంటికి చేరుస్తోంది చాయోస్. 'మేరీ వాలీ చాయ్' అనే కొత్త కాన్సెప్ట్‌తో .... వినియోగదారులు కోరిన పద్ధతిలో టీ పెట్టి ఇచ్చే విధానాన్ని కూడా మొదలెట్టింది. నితిన్ సలుజా, రాఘవ్ వర్మ అనే ఐఐటీ విద్యార్థులు చాయోస్‌ను స్థాపించారు.







INSIDE TIRUMALA TIRUPATI
NATIONAL GEOGRAPHIC EXCLUSIVE

# లక్షల క్లిక్కులవాడ గోవిందా... గోవింద!

**నేషనల్ జియోగ్రాఫిక్ చానల్‌లో ఇటీవల ప్రసారమైన 'ఇన్‌సైడ్ తిరుమల తిరుపతి' డాక్యుమెంటరీని ప్రపంచ వ్యాప్తంగా లక్షలమంది చూశారు. యూట్యూబ్ ద్వారా రోజూ కొన్ని వేల మంది తిలకిస్తూనే ఉన్నారు. దాని రూపకర్త తెలుగువాడే. పేరు కొండపల్లి రాజేంద్ర శ్రీవత్స.**

ఆ డాక్యుమెంటరీ చూస్తే ఏడుకొండలు ఎక్కినట్టే ఉంటుంది. ఆనంద నిలయంలో అడుగుపెట్టినట్టే అనిపిస్తుంది. బ్రహ్మాండ నాయకుడిని దర్శించుకున్న భావన కలుగుతుది. 'ఇన్‌సైడ్ తిరుమల తిరుపతి' పేరుతో నేషనల్ జియోగ్రాఫిక్ చానల్ డాక్యుమెంటరీ ద్వారా తిరుమల క్షేత్ర మహిమను ప్రపంచానికి చాటారు కొండపల్లి రాజేంద్ర శ్రీవత్స. తను పుట్టిందీ పెరిగిందీ హైదరాబాద్‌లో. ప్రస్తుత నివాసం ఢిల్లీలో. నిజాం కాలేజీలో డిగ్రీ పూర్తిచేశారు. తత్వశాస్త్రంలో పీజీ చేసేందుకు ఢిల్లీ యూనివర్సిటీలో చేరారు. అయితే.. మాస్ కమ్యూనికేషన్స్‌పై ఆయనకున్న అభిరుచిని చూసిన స్నేహితులు, దాన్నే వృత్తిగా ఎంచుకోమని ప్రోత్సహించారు. స్నేహితుల ప్రోత్సాహంతో అదే బాటలో ముందుకు సాగిన రాజేంద్ర.. రెండు దశాబ్దాల కెరీర్‌లో ఎన్నో మైలురాళ్లను అధిగమించారు. నేషనల్ జియోగ్రాఫిక్ చానల్ (ఇంటర్నేషనల్), ఎన్జీసీ ఇండియా, డిస్కవరీ నెట్‌వర్క్స్, డిస్కవరీ హెచ్‌డీ వరల్డ్, బీబీసీ వరల్డ్ వైడ్, దూరదర్శన్ వంటి ప్రఖ్యాత సంస్థల తరఫున ఎన్నో డాక్యుమెంటరీలు తీశారు. చాలావాటికి జాతీయ అంతర్జాతీయ అవార్డులొచ్చాయి. 2014లో 'నేషనల్ జియోగ్రాఫిక్ చానల్' ప్రారంభించిన 'ఇండియాస్ మెగా కిచెన్స్'.. రాజేంద్ర ఘనతే. అందులో భాగంగా 'టీటీడీ అన్నప్రసాదం'పై డాక్యుమెంటరీ చిత్రీకరించేందుకు రాజేంద్ర రావడమే.. 'ఇన్‌సైడ్ తిరుమల తిరుపతి' సాకారానికి మొదటి అడుగు!



**తొలి దర్శనం....**

"మెగా కిచెన్స్ ఆఫ్ ఇండియాలో భాగంగా టీటీడీ అన్న ప్రసాదం గురించి డాక్యుమెంటరీ తీసేందుకు బోర్డును సంప్రదించాను. అయితే.. కొండ మీద పరిస్థితి చూశాక.. కేవలం కిచెన్స్ మీద కాక, మొత్తంగా తిరుమల ఆలయంపై ఇంకా పెద్ద కథనం చేయాలని నా మనసుకు అనిపించింది. అలా పుట్టిందే ఈ డాక్యుమెంటరీ" అంటారాయన.

నిత్యం వేలాది మంది భక్తులు వస్తుంటారు. అయినా తిరుమలలో ఎక్కడా వసతుల లేమి.. అపరిశుభ్రత వంటివి మచ్చుకు కూడా కనపడవు! అదంతా అంత పద్ధతి ప్రకారం జరిగిపోవడానికి వెనుక జరిగే కృషిని.. వేలాది మంది భక్తుల ఆధ్యాత్మికతను.. కొండపై ప్రకృతి రమణీయతను కళ్లకు కట్టడమే లక్ష్యంగా ఈ డాక్యుమెంటరీని చిత్రీకరించినట్టు రాజేంద్ర చెబుతారు. అందులో భాగంగానే.. టైమ్‌లాప్స్, హైపర్‌లాప్స్ ఫొటోగ్రఫీ వంటి అత్యాధునిక టెక్నాలజీలను ఉపయోగించారు. దీనికి పట్టిన సమయం దాదాపుగా ఒక ఏడాది. తొలుత చిత్రీకరణకు సంబంధించిన ప్రణాళికలు రచించుకోవడం.. షూటింగ్ దశ.. పోస్ట్ ప్రొడక్షన్.. ఇలా పనిని మూడు భాగాలుగా విభజించుకుని రంగంలోకి దిగారు. "మా బృందంలో మొత్తం ఆరుగురు సభ్యులం. డాక్యుమెంటరీ నిమిత్తం తిరుమలలో రెండు దశలుగా 27 రోజులు ఉన్నాం. చిత్రీకరణకు కేటాయించింది 24 రోజులు. మొదటి 15 రోజులూ తిరుమలలోని అద్భుతమైన లొకేషన్లను, రోజువారీ కార్యకలాపాలను, క్షేత్ర నిర్వహణలో చాలా మందికి తెలియని విశేషాలను చిత్రీకరించాం. రోజూ 12 గంటలపాటు షూటింగ్ చేసేవాళ్లం. ఒక్కోసారి తెల్లవారుజామున 4 గంటలకే మా పని మొదలయ్యేది. రెండో దశలో.. తిరుమల బ్రహ్మోత్సవాలు జరిగిన 9 రోజులూ అక్కడే ఉన్నాం. ఉత్సవాలకు లక్షలాదిగా తరలివచ్చే భక్తజన సందోహాన్ని.. గోవిందనామ స్మరణతో తిరుమల మారుమోగే దృశ్యాలను ఒడిసిపట్టాం" అని రాజేంద్ర వివరించారు.

పోస్ట్ ప్రొడక్షన్‌కు పట్టిన సమయం ఆర్నెల్లు. స్క్రిప్టు రాసుకోవడం, దానికి అనుగుణంగా.. ఎడిటింగ్, గ్రాఫిక్స్, విజువల్ ఎఫెక్ట్స్ హంగులు చేకూర్చడం ఈ దశలో చేశారు. ప్రసారానికి ముందు విడుదలైన ప్రోమో వీడియోకే అనూహ్యమైన స్పందన వచ్చింది. నేషనల్ జియోగ్రాఫిక్ చానల్ తన ఫేస్‌బుక్ పేజీలో ఆ ప్రోమో వీడియో పెడితే.. 24 గంటల వ్యవధిలో 10 లక్షల మంది చూశారు. వారంలో కోటిన్నర మందికిపైగా చూశారు. కాల్పనికేతర విభాగంలో ప్రసారమైన డాక్యుమెంటరీల్లో దీనికే అత్యధిక ప్రేక్షకాదరణ (టీఆర్పీ రేటింగ్) వచ్చింది. ఇదంతా ఆ స్వామి మీద ప్రజలకున్న భక్తివల్లనే సాధ్యమైందంటారు రాజేంద్ర.



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## థైరాయిడ్ సమస్యలకు సరైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ఈ మధ్యకాలంలో దేశజనాభాలో చాలా ఎక్కువ మంది - థైరాయిడ్ సమస్యలతో బాధపడటం జరుగుతోంది. మారుతున్న మానవుని జీవనశైలితో పాటు అధిక మానసిక ఒత్తిడికి లోనవడం ఈ సమస్యకు గల ప్రధాన కారణంగా చెప్పవచ్చు. దీని వలన శరీర బరువులో మార్పులు ఏర్పడటం, స్త్రీలలో ఋతుచక్ర సమస్యలు, పిల్లలలో ఎదుగుదల సమస్యలు మొదలైన దుష్ఫలితాలను ఎదుర్కోవడం జరుగుతోంది. అయితే ఈ సమస్యతో బాధపడేవారు 'జీవితకాలం పాటు మందులు వాడటం' లేదా 'తప్పనిసరిగా శస్త్రచికిత్స చేయించుకోవడం' ద్వారా మాత్రమే థైరాయిడ్ సమస్య నుండి బయట పడగలమని భావిస్తుంటారు. కానీ హోమియో చికిత్సను అందించడం ద్వారా ఈ థైరాయిడ్ సమస్యలను సంపూర్ణంగా నయం చేసే అవకాశం ఉంది.

మానవ శరీరంలోని ముఖ్యమైన గ్రంథులలో ఒకటైన థైరాయిడ్ గ్రంథి - మెడ ప్రాంతంలో కంఠం దగ్గర సీతాకోకచిలుక రెక్కల రూపంలో శ్వాసనాళానికి ఇరుప్రక్కలా ఉంటుంది. థైరాయిడ్ గ్రంథి మన మెదడులోని పిట్యుటరీ గ్రంథి నియంత్రణలో ఉంటుంది. శరీరంలో తగినంతగా థైరాయిడ్ హార్మోన్‌లు లేనప్పుడు, పిట్యుటరీ గ్రంథి ఆ అవసరాన్ని గ్రహించి TSH (థైరాయిడ్ స్టిమ్యులేటింగ్ హార్మోన్)ను విడుదల చేస్తుంది. ఈ TSH సంకేతంతోనే థైరాయిడ్ గ్రంథి T3, T4 అనబడే థైరాయిడ్ హార్మోన్‌లను ఉత్పత్తి చేసి రక్తప్రవాహంలోకి పంపుతుంది. ఇలా రక్తంలో కలిసిన T3, T4 హార్మోన్‌ల ప్రభావం - శరీర ఎదుగుదల, శ్వాస వ్యవస్థ, గుండె, నాడీమండలం, జీర్ణ వ్యవస్థ, బేసల్ మెటబాలిక్ రేట్ మరియు సంతానోత్పత్తి వ్యవస్థ వంటి అన్ని జీవక్రియలపై ఉంటుంది.




ఇలా నిరంతరం మన శరీరంలో థైరాయిడ్ హార్మోన్‌లు తగిన స్థాయిలో ఉండే వ్యవస్థ విఫలమై, తద్వారా థైరాయిడ్ హార్మోన్‌ల ఉత్పత్తి ఎక్కువ మరియు తక్కువ కావడం ఒక ఖచ్చితమైన సమస్యగా పరిణమిస్తుంది. ఈ రకమైన అసమతుల్యతలు - హైపోథైరాయిడ్ లేదా హైపర్‌థైరాయిడ్ మరియు గాయిటర్ అనే దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలకు దారి తీస్తాయి.

**హైపోథైరాయిడిజం:** ఇది సర్వసాధారణమైన సమస్య. శరీరంలో థైరాయిడ్ హార్మోన్‌లు తక్కువ మోతాదులో ఉత్పత్తి కావడంతో తలెత్తే ఈ సమస్య సహజంగా పిల్లలు, స్త్రీలలో ఎక్కువగా కనిపిస్తుంది. ఏ వయస్సు వారిలోనైనా ఇది కనిపించవచ్చు.
**లక్షణాలు:** **పిల్లలలో** - బుద్ధిమాంద్యం, ఎదుగుదల లోపం, జ్ఞాపకశక్తి లేకపోవడం, మలబద్ధకం, చురుకుదనం కోల్పోవడం, వయస్సుకు మించి లావుగా ఉండటం. **యుక్తవయస్సు వారిలో:** ఒంట్లో నీరు చేరి బరువు పెరగడం, BMR తగ్గిపోవడం, రజస్వల (మెనార్క్) ఆలస్యం కావడం, ఋతుచక్రం ఆలస్యం కావడం, అమెనోరియా, నెలసరిలో అధిక రక్తస్రావము లేదా అల్ప రక్తస్రావము ఉండటం, సంతానలేమి, చర్మం పొడిబారడం, వెంట్రుకలు రాలడం, బద్ధకంగా ఉండటం, చలిని తట్టుకోలేకపోవడం, అర్టికేరియా అనే చర్మసంబంధిత వ్యాధుల వంటి లక్షణాలతో హైపోథైరాయిడ్ సమస్యను సులువుగా గుర్తించవచ్చు.

**హైపర్‌థైరాయిడిజం:** థైరాయిడ్ గ్రంథి - ఎక్కువ మోతాదులో థైరాక్సిన్‌ను విడుదల చేయడం వలన వచ్చే సమస్యను హైపర్‌థైరాయిడిజం అంటారు.
**లక్షణాలు:** ఆహారం సరైన మోతాదులో తీసుకున్నప్పటికీ బరువు తగ్గిపోవటం, నిద్రలేమి, గుండెదడ, అధిక చెమటలు, విరేచనాలు, చేతులు వణకడం, నీరసంగా ఉండటం, నెలసరి త్వరగా రావడం, ఋతుచక్రములో అధిక రక్తస్రావం జరగడం.

**గాయిటర్:** థైరాయిడ్ గ్రంథి వాపునకు గురి కావడాన్ని 'గాయిటర్' అంటారు. కొన్ని సందర్భాలలో ఇది సాధారణ పరిమాణం కంటే రెండింతలు పెరిగి, స్వరపేటికపైన ఒత్తిడి చేయడం వలన మాట్లాడేటప్పుడు స్వరంలో (వాయిస్) మార్పు స్పష్టంగా కనిపిస్తుంది. గాయిటర్‌లో T3, T4 థైరాయిడ్ హార్మోన్‌లు సాధారణ స్థితిలో ఉన్నప్పటికీ గాయిటర్ లేనట్లుగా నిర్ధారించలేము. **కారణాలు:** దీనికి అతి ముఖ్యమైన కారణం 'అయోడిన్' అనే మూలకం లోపం మరియు గ్రేవ్స్ డిసీజ్, పిట్యుటరీ గ్రంథిలో ఏర్పడే కణితులు (ట్యూమర్స్), థైరాయిడ్ క్యాన్సర్ వంటివి గాయిటర్ సమస్యకు దారితీస్తాయి.
**లక్షణాలు:** గొంతు క్రింద వాపు రావటంతో ఆహారం మ్రింగడానికి కష్టంగా ఉంటుంది. స్వరంలో మార్పులు రావటం, ఎక్సాప్తాల్మిక్ గాయిటర్ అనగా కనుగుడ్లు బయటకు పొడుచుకు వచ్చినట్లుగా ఉండటం, టిబియల్ మిక్సెడిమా వంటి లక్షణాలు కనపడటం జరుగుతుంది.

**థైరాయిడ్ సమస్యలకు గల కారణాలు:** నేటి మానవ జీవన విధానం ప్రకృతి విరుద్ధముగా ఉండటం, సరైన శారీరక వ్యాయామం లేకపోవడం, పౌష్టికాహార లోపం, అయోడిన్ లోపం, థైరాయిడ్ గ్రంథిని కొద్దిగా తొలగించడం మరియు పిట్యుటరీ గ్రంథిలో వచ్చే వ్యాధుల వలన ఈ థైరాయిడ్ సమస్యలు ఎదురవుతాయి.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** థైరాయిడ్ ప్రొఫైల్ - T3, T4, TSH, యాంటీ థైరాయిడ్ యాంటీ బాడీస్, USG ఆఫ్ థైరాయిడ్ గ్లాండ్, గొంతు యొక్క CT స్కాన్ వంటి పరీక్షల ద్వారా వ్యాధిని నిర్ధారిస్తారు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో ముందుగా రోగి యొక్క శరీర తత్వాన్ని క్షుణ్ణంగా పరిశీలించిన తదుపరి మాత్రమే అందించబడే జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ సిమిలిమం విధానం ద్వారా, హైపోథలామస్-పిట్యుటరీ-థైరాయిడ్ వ్యవస్థను సరిచేసి థైరాయిడ్ సమస్యలను పూర్తిగా నయం చేయవచ్చు.

టోల్ ఫ్రీ 1800 108 1212

కన్సల్టేషన్ ఉచితం
955 000 1199

www.homeocare.in

ADVT

# అంకెలు

వేంపల్లె షరీఫ్

**అబ్దుల్లాకు ఏం చేయాలో తెలియడం లేదు. ముందు నుయ్యి వెనుక గొయ్యి అంటారే అలా ఉంది పరిస్థితి. చూస్తుండగానే సమస్య పెద్దదై కూర్చుంది. అటు చూస్తే ఎమ్మెల్యే ఇటు చూస్తే ఆడోళ్లు. ఎవరితో పెట్టుకున్నా కష్టమే. న్యాయమేమో రెండు వైపులా ఉంది.**

**ఆలోచించాడు. ఆలోచిస్తూనే ఉన్నాడు.**

**అసలు కథ వారం రోజుల ముందు మొదలైంది.**

**ఉన్నట్టుండి ఎమ్మెల్యే కిట్టప్ప అబ్దుల్లాను పిలిపించాడు.**

**అబ్దుల్లా 21వ డివిజన్ కార్పొరేటర్. కార్పొరేటర్గా సాయిబు ఉన్నాడంటే ఆ డివిజన్లో దాదాపు అంతా సాయిబులే ఉంటారని వేరే చెప్పాల్సిన పనిలేదు.**

**'తనతో కిట్టప్పకు ఏంటా పని?' అని ఆలోచించుకుంటూనే వెళ్లాడు అబ్దుల్లా.**

**అతని అనుమానం నిజమైంది.**



ఇది ఎన్నికలకు సంబంధించిన గొడవే.

"అబ్దుల్లా నీకు తెలుసు. పదినెలల్లో ఎలక్షన్లు ఉండాయి. పార్టీ సంగతి తెలుసు గదా. పనిచేయించుకున్నన్నాళ్లు పనిచేయించుకుంటాది. తర్వాత పక్కన పెడతాది. ఇప్పుడు గుడక యవ్వారం అట్టాగే ఉన్నట్టుండాది. నీవు గుడక యినే ఉంటావు. ఈసారి నాగ్గాకండా ఆ యిప్పిరి నా కొడుకు ఉండాడు గదా .. బీమన్న గాడు, వాడికి టిక్కెట్టియ్యాలని చూస్తాండాది పార్టీ. నా కర్మగాలి వాడూ నా కులపోడే. ఏమనేదానికి లేకండా పోయిండాది. వాడికి టిక్కెట్టిచ్చినా నాకు టిక్కెట్టిచ్చినా కులం ఓట్లు యాడికి బోవు అనుకుంటాంది పార్టీ. అదే జరిగితే నేను రెబల్గా అయినా పోటీలో ఉంటా. అప్పుడు కులం ఓట్లు చీలిపోయి మిగతా కులాల ఓట్లు కూడా నాకే పడి గెలుచ్చా అని పార్టీకి దగ్గరగా ఉండే ఒకరిద్దరి దగ్గర సెప్పుకుంటా వొచ్చాండా. ఆ బయం పార్టీలో అట్టనే ఉండాలంటే ఈ నియోజకవర్గంలో ఈ పది నెల్లూ నేను పెట్టే మీటింగుల్లో జనం దండిగా కనబడల్లా. నీవేం జేచ్చావో నాకు తెల్దు" అన్నాడు.

ఒక్క క్షణం ఆలోచించాడు అబ్దుల్లా.

సొంత పార్టీ. సొంత నియోజకవర్గంలో సిట్టింగ్ ఎమ్మెల్యే. కాదని బతకలేం. ఎందుకొచ్చిన గోల అనుకున్నాడు.

"సరే సార్. మీరింతగా సెప్పాల్నా. ఇక మింద మీరు యాడ మీటింగు పెట్టినా నా డివిజన్ నుండి మనుషులు ఉంటారు" అన్నాడు.

"ఒట్టినే ఉండటం కాదు రోయ్. అల్లర్ అల్లర్గా ఉండాల. ముఖ్యంగా గ్నాపకం పెట్టుకో.. ఆడోళ్లు దండిగా కనబడల్ల. అప్పుడే సింపతీ వర్కవుట్ అయి మనం అనుకుంటాండేది జరిగేది. అసలే సాయిబూ ఆడోళ్లు కదా.. బుర్ఖాలు దండిగా కనబడితే గానీ  పార్టీ వోళ్లు నాకు కింది కులాల్లో బాగా ఫాలోయింగ్ ఉండాదని నమ్మరు" అన్నాడు.

"అట్టనే గానీ సార్ " అని చెప్పి ఇంటికొచ్చేశాడు అబ్దుల్లా.

ఇది జరిగిన మూడో రోజు ఎమ్మెల్యే కిట్టప్ప మనిషి రాముగాడు టీవీఎస్ మీద నేరుగా ఇంటికొచ్చి "ఈ ఆదివారమే గాంధీ రోడ్డులో మీటింగు. పెద్దాయన సెప్పమన్నాడు. దండిగా మంది ఆడోళ్లను తోలక రమ్మన్నాడు" అని  చెప్పి వెళ్లిపోయాడు.

వాడు అబ్దుల్లా సమాధానం కోసం కూడా ఎదురుచూడలేదు.

'వాడంతే. పొగరుబోతు. ఆ ఎమ్మెల్యే అయినా సెప్పింది వింటాడేమో గానీ వీడు మాత్రం వినడు' మనసులోనే గొనుక్కుని మీటింగుకు వీలైనంతమంది జనాన్ని తరలించే పనిలో పడ్డాడు అబ్దుల్లా.

డివిజన్ అంతా రాయల్ ఎన్ఫీల్డ్ బైక్లో చక్కర్లు కొట్టి "అగే బచ్చీ, ఓ ఖాలా.. ఆ బూ.. ఈ బూ.." అనుకుంటూ అందరికీ చెప్పొచ్చాడు.

"మీటింగుకు నిండుగా బుర్ఖాలు కప్పుకుని రావల్ల" అన్నాడు.

ఆదివారం రానే వచ్చింది. మీటింగు జరగనే జరిగింది. పొలోమని దండిగా జనాలు రానే వచ్చారు. వాళ్లలో సాయిబూలు చాలామంది ఉండనే ఉన్నారు కానీ ఎమ్మెల్యే కిట్టప్పకు మాత్రం మనస్ఫూర్తిగా అనిపించలేదు.

అందుకే మరుసటిరోజు అబ్దుల్లాను పిలిపించి "నీకేం చెప్పినాన్రా... మీటింగులో దండిగా మంది సాయిబూ ఆడోళ్లు కనబడల్ల అని సెప్పినానా? లేదా?"

"సెప్పినార్ సార్"

"మల్ల ఏరిరా వాళ్లు?"

"ఎందుకు లేరు సార్. రెండొందల మందికి తక్కవ కాకండా వొచ్చినారు సాయిబూల ఆడోళ్లు. కావాల్లంటే నేను ఈడ్నే ఉంటా. మీ మనుషులు ఎవర్నయినా సరే, మా డివిజన్కు పంపించి విసారించుకుని రమ్మనండి. అప్పుడు తెలుచ్చాది" అన్నాడు.

ఇంత కరాఖండిగా చెప్పేసరికి ఎమ్మెల్యే కొంత మెత్తబడ్డాడు.

"మీటింగుకు సాయిబూలు దండిగామంది వొచ్చినమాట నిజమే వోయ్. ఆడ జనాలు గుడక దండిగా మంది కనబడినారు. కానీ సాయిబూల ఆడోళ్ల గురించి నేను అడగతాండ. నువ్వన్నట్టు ఆ ఆడోళ్లే గనక వచ్చివుంటే మీటింగు అంతా బురఖాలే కనబడల్ల గదా. ఆడాడ యాన్నో రెండు మూడు బురఖాలు మట్టుకే కనబడినాయి"

"ఓహో అదా మీరు అడుగుతాండేది" అని దిగులుగా ముఖం పెట్టి చెప్పాడు అబ్దుల్లా.

బొమ్మలు : అక్బర్

“అయ్యా. నేను ఇంటింటికి తిరిగి ఆడోళ్లను బురఖాలు వేసుకురమ్మని సెప్పినా. కానీ ఏం జేయల్ల ... ఎవరిండ్లల్లో కూడా కావాల్సినన్ని బురఖాలు లేవు. ఆరుగురు ఆడోళ్లున్న ఇంటికి ఒకే ఒక బుర్ఖా ఉండాదంటే నమ్మి తీరల్ల. అది గుడక బొరకలు పడి చిరిగిపోయి ఉండాది. దాన్ని ఎవరికని తొడుగుతారు సెప్పండి. ఒక్క బురఖాతో అందరూ ఒకే తూరి బయటికి రావల్లంటే వీలయితాదా? మా ఇళ్లల్లో శానామంది ఆడోళ్లకు బురఖాల్లేవయ్యా. ఒక నూటాయాభై రెండొందలు పెట్టి బురఖాలు గుడక కొనుక్కోలేని యీనమైన స్థితి అయ్యా మాది. ఏదైన అవసరమొస్తే అప్పటికప్పుడు పక్కింట్లోనో, ఎదురింట్లోనే అడుక్కుని బురఖాలు తొడుక్కుని వస్తారు. ఆ ఎదురింటోళ్లు, ఆ పొరుగింటోళ్లను గుడక మనం మీటింగుకు రమ్మంటిమి. ఇంగ యాడ దొరుకుతాయి వీళ్లకు బురఖాలు. ఆడికీ అయ్యా ... నా మాట మింద ఉన్నకాడికి ఆడోళ్లు బురఖాలు ఏసుకొచ్చినారయ్యా. శానామంది పాత బురఖాను అప్పటికప్పుడు కుట్టుకోని వచ్చినారు. కుట్టుకోవడానిక్కూడా వీల్లేని వాళ్లు.. తమ మానాన్ని గుడక లెక్క జెయ్యకండా అబ్దుల్లా అన్న సెప్పినాడు గదా అని నెత్తిన గుడ్డ కప్పుకుని మీటింగుకు వచ్చినారయ్యా ...”అన్నాడు.

కిట్టప్పకు నోట మాట రాలేదు.

కాసేపు ఆలోచించి ఓ మాటన్నాడు.

“మొన్న ఓ రోజు హైదరాబాద్లో ఎవరో రచయిత్రి ఒకామె అసెంబ్లీ కాడ కనబడింది. ముస్లిం ఆడోళ్లు బురఖా నుంచి బయటపడ్డప్పుడే వాళ్లకు స్వేచ్ఛ అని మాట్లాడింది. అసలు బుర్ఖాలే కొనుక్కునే స్థోమత లేనివాళ్లు ఇక బురఖా నుంచి బయటపడ్డమేంది ... అంతా విచిత్రంగా ఉండాదే!” అన్నాడు.

అబ్దుల్లా ఏం మాట్లాడలేదు.

ఎమ్మెల్యే తాను కూర్చున్న సీట్లోంచి లేచి కాసేపు అటూ ఇటూ పచార్లు చేసి తర్వాత మళ్లీ వచ్చి కూర్చున్నాడు. ఎదురుగా టీపాయ్ మీద ఉన్న ఆపిల్ ఫోన్ చేతుల్లోకి తీసుకుని అమ్మవారి శాల రోడ్డులో ఉండే తోటి కులపోడి కొట్టుకు కాల్ చేశాడు.

“ఏమప్పా బావుండావా? ఏం లేదు. అర్జంటుగా నాలుగు వందల బురఖాలు కావల్ల. రేపటి కల్లా రెడీ చెయ్యి” అని ఆర్డర్ ఇచ్చాడు.

మనసులోనే సంతోషపడ్డాడు అబ్దుల్లా. ఎమ్మెల్యేకు గౌరవంగా ఒక నమస్తే పెట్టి ఇంటికొచ్చేశాడు.

ఇది జరిగి రెండు రోజులు కూడా తిరక్కుండానే డివిజన్లో తన కార్యాలయానికి నాలుగు వందల బురఖాలు వచ్చేశాయి. వీధిలో చురుగ్గా ఉండి ఎప్పుడూ తనెంటే తిరిగే నలుగురు కాలేజి కుర్రోళ్లు రామాంజి, బాషా, జిలానీ, చంటిని పిలిచి ఈ బురఖాలను ఇంటింటికి తిరిగి ఆడోళ్లకు పంచే పనిని పురమాయించాడు. వాళ్లలో బాషా, చంటి ఇద్దరూ బాగా ఆవేశపరులు. దానికితోడు ఆలోచనాపరులు.

“ఆడోళ్లకు బురఖాలు పంచేటప్పుడు నోరు జారి ఏదైనా అనేర్రోయ్ ... ఒళ్లు దగ్గర పెట్టుకుని పంచండి ...” అని వార్నింగ్ ఇచ్చి పంపాడు అబ్దుల్లా.

పంపాడే కానీ అతనికి మనసులో మాత్రం కొంత వెలితిగానే ఉంది.

“ఆడోళ్లకు బురఖాలు పంచడంతోనే వారి పేదరికం పోదు కదా. వాళ్లకు సదువు సెప్పించాల. మంచి వైద్యం చేయించాల. కండపట్టే తిండి తినిపించాల. అట్ట జెయ్యకండా బురఖాలు పంచడం ఏంది? బురఖాలు లేవనగానే ఎమ్మెల్యే వెంటనే ఆర్డర్ ఇచ్చినాడు. ఎందుకంటే అవసరం కాబట్టి. అదే వాళ్లకు తిండి లేదంటే అసెంబ్లీలో మాట్లాడతాడా? మాట్లాడ్డు. ముస్లిములు బాగుపడాలంటే తన బోటి వాళ్లు శానా పనులే జెయ్యాల. అసలు ముస్లింలను ఓటుబ్యాంకుగా చూడ్డం మానెయ్యాల”

ఈ వారం కథ

“ఆడోళ్లకు బురఖాలు పంచడంతోనే వారి పేదరికం పోదు కదా. వాళ్లకు సదువు సెప్పించాల. మంచి వైద్యం చేయించాల. కండపట్టే తిండి తినిపించాల. అట్ట జెయ్యకండా బురఖాలు పంచడం ఏంది? బురఖాలు లేవనగానే ఎమ్మెల్యే వెంటనే ఆర్డర్ ఇచ్చినాడు. ఎందుకంటే అవసరం కాబట్టి. అదే వాళ్లకు తిండి లేదంటే అసెంబ్లీలో మాట్లాడతాడా? మాట్లాడ్డు. ఈ దేశంలో ముస్లిములు బాగుపడాలంటే తన బోటి వాళ్లు శానా పనులే జెయ్యాల. అసలు ముస్లింలను ఓటుబ్యాంకుగా చూడ్డం మానెయ్యాల” రకరకాలుగా ఆలోచించాడు.

ఇతనిలా ఆలోచనల్లో ఉండగానే ఓరోజు పొద్దున మళ్లీ రాముగాడు ఊడిపడ్డాడు.

“పెద్దాయన సెప్పమన్నాడు. ఈ శుక్కురోరం ఆర్ట్స్ కాలేజి గ్రౌండులో పెద్ద మీటింగు. పార్టీ అధ్యక్షుడు గుడక వొచ్చాండాడు. ఇది శానా ముక్యమంటా. మీటింగులో అంతా బురఖాలే కనపడల్లని సెప్పినాడు.”

“సరే” అన్నాడు అబ్దుల్లా.

కానీ టెన్షన్ మొదలైంది.

ఎందుకంటే బాబయ్య స్వామి ఉర్సు జరుగుతోంది కూడా శుక్రవారమే. ఆడోళ్లంతా మొక్కు తీర్చుకోవడానికి ఉర్సుకు వెళ్తున్నారు. ఏ రెండు మూడు కుటుంబాలో తప్ప చాలామంది ఉర్సుకే వెళ్తారు. ఇప్పుడు బురఖాలు పంచాం కదా అని ఉర్సు వదులుకోనైనా రమ్మంటే తిరగబడనైనా తిరగబడతారు. అలా అని ఎమ్మెల్యే మీటింగుకు ఎగ్గొటితే పరువు ఉండదు. ఇదీ అబ్దుల్లాకొచ్చిన కష్టం.

బాగా ఆలోచిస్తుంటే మొన్న బురఖాలు పంచిన ఆ నలుగురు కుర్రాళ్లలో ఇద్దరైన బాషా, చంటి అక్కడికి వచ్చారు.

“ఏందుకన్నా డల్గా ఉండావ్?” అన్నాడు ముందుగా చంటి.

సమస్య చెప్పాడు అబ్దుల్లా.

“ఈ రోంత దానికే టెన్షన్ ఎందుకన్నా. ఇట్టాంటిదేదో జరుగుతాదనే మేము ముందుగానో ఆలోసించి ఓ నూరు బురఖాలు పక్కన తీసి పెట్టినాం. మన కాలేజి కుర్రోళ్లు, మనం సెబితే చేసేటోళ్లు శానామందే ఉండారు. అందరినీ దింపి తలా ఒక బురఖా వేసుకోమంటామ్. మీటింగు అయిపోయిందాక ఉంటే తలా నూర్రూపాయలు లెక్క గుడక ఇస్తామని జెబుదాం” అన్నాడు చంటి.




అబ్దుల్లా నవ్వుకున్నాడు.

“ఎమ్మెల్యేకు తెలిస్తే?” అన్నాడు.

“తెలిస్తే తెలియనీ. ఆయప్పకు కావాల్సింది బురఖాలు కానీ సాయిబూలు కాదు కదా..” అన్నాడు బాషా వెంటనే అందుకుని.

“ఔన్రా అబ్బీ. సిన్నోనివైనా శానా బాగా సెప్పినావ్” అబ్దుల్లా సులభంగానే కన్విన్స్ అయిపోయాడు.

తెల్లారింది.

ఆర్ట్స్ కాలేజి గ్రౌండ్లో మీటింగు మొదలైంది.

బురఖాలు ఒక్కొక్కటే మీటింగుకు చేరుకోవడం మొదలుపెట్టాయి.

.................................................................

రచయిత సెల్ : 96034 29366

# మనుషులే పుస్తకాలు!

ఎవరైనా గ్రంథాలయానికి వెళ్లినపుడు ఏం చేస్తారు? కావాల్సిన పుస్తకాన్ని తీసుకుని నిశ్శబ్దంగా చదువుకుంటారు. అనుమతిస్తే ఒకటి రెండు పుస్తకాలు చదువుకోవడానికి ఇంటికి తీసికెళతారు. కానీ ఈ లైబ్రరీకి వెళితే పుస్తకాలకు బదులు మనం మనుషుల్ని ఇంటికి తెచ్చుకోవచ్చు. వాళ్లు మనకు తమ కథల్ని చెబుతారు. నవ్వుతారు, నవ్విస్తారు... ఏడుస్తారు, ఏడిపిస్తారు. మనం పుస్తకం చదువుతున్నపుడు సందేహాలొస్తే ఏం చేస్తాం. మనకంటే పెద్దవాళ్లెవరినైనా అడుగుతాం. లేకపోతే నెట్‌లో సెర్చ్ చేస్తాం. అంతే కదా! కానీ ఈ పుస్తకాల్లాంటి మనుషులను మనం బోలెడన్ని ప్రశ్నలు అడగవచ్చు. మనుషులు పుస్తకాలెలా అవుతారు అనే సందేహం వస్తుందా? ఏం లేదు... మీకు ఆటిజం మీద ఆసక్తి ఉంటే ఆటిజం ఉన్న వ్యక్తిని ఇంటికి తీసుకెళ్లొచ్చు. అతడు తన అనుభవాలను వివరిస్తాడు. ఆటిజం అంటే




ఏమిటో కళ్లకు కట్టినట్టు విడమరుస్తాడు. అలాగే మనుషులు శరణార్థులుగా ఎందుకు మారుతున్నారో తెలుసుకోవాలంటే ఒక రెఫ్యూజీని మీతో కూర్చోబెట్టుకోవచ్చు. ప్రత్యక్షంగా బాధననుభవించిన ఆ శరణార్థి మాటల కంటే గొప్పగా, ఏ పుస్తకం మీకు వాళ్ల బాధను అర్థం చేయిస్తుంది?

డెన్మార్క్ రాజధాని కోపెన్‌హాగన్‌లో 2000వ సంవత్సరంలో 'స్టాప్ ద వయొలెన్స్' అనే యూత్ మీటింగ్ జరిగింది. అస్సలు పరిచయం లేని వ్యక్తుల మధ్య జరిగిన ప్రశ్న-జవాబు కార్యక్రమం అక్కడి పరిస్థితుల పట్ల చక్కటి అవగాహనను కలిగించింది. అదే 'హ్యూమన్ లైబ్రరీ' ఆలోచనకు నాంది అయింది. ఆ తర్వాత 'మానవ గ్రంథాలయం' భావన వేగంగా డెబ్బై దేశాలకు పాకింది.




# O.U. మా అవ్వ




ఈ వారం కవిత

ప్లాస్టిక్ శెయ్యిసంచిల పాతబట్టలేస్కోని
నాలుగు డిగ్రి వయ్యి[1] లేస్కోని
సికింద్రబాదు రైల్‌టేషన్ల ప్యాసింజర్ బండిదిగి
పదోనెంబర్ ప్లాటుపాం బయట నిలబడి
ఎటుపోవాల్నో అర్థంగాక నాకు ఏడుపస్తాంటె ..
మాణికేశ్వర్‌నగర్, ఇప్పుల్ల మీదికెల్లి, చిలుకలగూడ మీదికెల్లి
పావురంగ శేతులు జాపి నన్ను గుండెలకు అమురుకున్నది
O.U. మా అవ్వ

M.A Ph.d లు సదివి
అంబేద్కర్, జ్యోతిబాపూలే అంతగాకున్నా
మా దళిత బహుజనులల్ల నేను సుత
ఓ దీపంతనై ఎలుగునియ్యాల్నని తండ్లాడుతాంటె
సెంట్రల్ లైబ్రరై నన్ను శేరదీసి గొప్ప గొప్ప సార్ల వయ్యిలిచ్చి
చిటికెనేలు పట్టుకోని నడిపిచ్చి బతుకు తొవ్వ జూపింది
పట్టపగటీలి ఎర్రెటెండల సదువుకుంటాంటె
గుల్‌మొహర్, పొడ, కానుగ, ర్యాల, సెల్టోఫాం చెట్లై
'ల్యాండ్‌స్కేప్' గార్డన్ల నాకు నీడనిచ్చింది
O.U. మా అవ్వ

తమాటతొక్కు, మామిడికాయె తొక్కు, కంట్రోల్ బువ్వ తినే
కూటికి గతిలేని నా బతుకుకు
సరయు హాస్టలై (E2) సిమెంటు రేకుల అర్రల (82)
బుంతంత జాగనిచ్చింది
గూనుగు పువ్వులసొంటి తెల్లటి సన్న బువ్వ బెట్టి
కూరేసి, సాంబార్, పచ్చిపులుసు బోసి,
ఎప్పుడు ఎండుకపోయుండె నా కడుపు నిండ బువ్వయ్యింది
కష్టాలు మర్సిపోయి కడుపుల కాళ్లు బెట్టుకోని,
ఇనుపమంచం మీద కుక్కుకూనోలె ముడుసుకోని కనుమలుపుతె
పాత 'ఖైతాన్' ఫ్యానై గాలిసిరి నన్ను పండుకోబెట్టింది
O.U. మా అవ్వ

నా బోళాతనం, అమాయకత్వం జూసి
పట్నపోళ్లు నన్ను పరేషాన్ జేత్తె
బతుకు బిస తప్పి, కలల చెలుకలు బీడై బోడసరం[2] మొలుస్తె
పుట్టెడు దుఃఖంల నేనుంటే - కొడుకా .. రారా అని పిలుస్తది
నేను బొయ్యి 'ఆర్ట్స్ కాలేజి' ముందు అశోక చెట్టుకింద కూసుంటె
మా ఇంటి సాయబాను[3] కింద అరుగుమీద కూసున్నట్టనిపిస్తది
నడి ఎండకాలంల చెరువు నీళ్లను ఎండ ఆవిరిజేసినట్టు
నా గుండెల రందినంత ఆవిరి జేస్త
ఎక్కడలేని ధీరెనిస్తది, ధైర్యాన్నిస్తది
O.U. మా అవ్వ

- కందికొండ
(సినీ గేయ రచయిత),
73374 97065

● ఉస్మానియా శతాబ్ది ఉత్సవాల సందర్భంగా ...

1 - పుస్తకం 2 - పిచ్చిమొక్క 3 - వసారా

ఫుడ్ కోర్ట్

# సర్వం సొరకాయ స్వాహా...



## సొరకాయ పొట్టు చట్నీ

**కావలసిన పదార్థాలు**

సొరకాయ పొట్టు- అర కప్పు, శనగపప్పు- అర టేబుల్ స్పూను, మినప్పప్పు- ఒక టేబుల్ స్పూను, ఎండుమిర్చి- నాలుగు, తరిగిన ఉల్లిపాయ, టమోటా- ఒక్కోటి, వెల్లుల్లి రెబ్బలు- నాలుగు, కరివేపాకు, కొత్తిమీర- కొద్దిగా, చింత పండు పులుసు- పావు కప్పు, నూనె- ఒక టేబుల్ స్పూను, ఉప్పు- తగినంత.

**తయారీ విధానం**

ఒక బాణలిలో నూనె పోసి శనగపప్పు, మినప్పప్పు వేసి వేగించాలి. తర్వాత ఎండుమిర్చి, టమోటా, ఉల్లిపాయ ముక్కలు, వెల్లుల్లి వేసి 2 నిమిషాలు వేగించాలి. సొరకాయ పొట్టు, కొత్తిమీర, కరివేపాకు కూడా వేసి 5 నిమిషాలు వేగించాలి. తర్వాత చింతపండు పులుసు, పసుపు వేసి మరో 2 నిమిషాలు ఉడికించి దించేయాలి. చల్లారిన తర్వాత ఉప్పు వేసి మెత్తగా రుబ్బుకుని, పోపు పెట్టుకోవాలి.





## కోఫ్తా సొర

**కావలసిన పదార్థాలు**

సొరకాయ ముక్కలు- ఒక కప్పు, అల్లంవెల్లుల్లి ముద్ద- అర టీ స్పూను, మిరియాలు- చిటికెడు, గసగసాలు- ఒక టేబుల్ స్పూను, నూనె- రెండు టేబుల్ స్పూన్లు, కరివేపాకు- కొద్దిగా, జీలకర్ర- ఒక టీ స్పూను, అల్లం తురుము- ఒక టేబుల్ స్పూను, తరిగిన టమోటాలు- రెండు, ఎండుకొబ్బరి తురుము, జీడిపప్పు- చెరో పావు కప్పు, ధనియాల పొడి- ఒక టేబుల్ స్పూను, పసుపు- పావు టీ స్పూను, గరం మసాలా- ఒక టీ స్పూను, కారం- రెండు టీ స్పూన్లు, నూనె- వేయించడానికి సరిపడా, కొత్తిమీర- కొద్దిగా, ఉప్పు- తగినంత.

**తయారీ విధానం**

ఎండుకొబ్బరి తురుము, జీడిపప్పులను కలిపి అరగంటసేపు నానబెట్టి, మెత్తగా రుబ్బుకోవాలి. ఒక బాణలిలో సొరకాయ ముక్కలు, ఉప్పు, అల్లం తురుము, మిరియాలు, గసగసాలు వేసి 5 నిమిషాలు వేగించాలి. దింపేసి చల్లారిన తర్వాత లడ్డూల్లా ముద్దలు కట్టుకుని.. నూనెలో గారెల్లా కాల్చుకోవాలి. మరో బాణలిలో ఒక టేబుల్ స్పూను నూనె పోసి కరివేపాకు, జీలకర్ర, అల్లంవెల్లుల్లి ముద్ద వేసి వేగించాలి. తర్వాత టమోటాలు వేసి 5 నిమిషాలు వేగించాలి. ఆ తర్వాత ధనియాల పొడి, ఉప్పు, పసుపు, గరం మసాలా వేసి 2 నిమిషాలు మగ్గించాలి. ఎండుకొబ్బరి ముద్దను కూడా వేసి రెండు కప్పుల నీళ్లు పోసి మరో 2 నిమిషాలు ఉడికించాలి. ఆ తర్వాత వేగించిన సొరకాయ లడ్డూలు, కొత్తిమీర వేసి చిన్నమంట మీద 2 నిమిషాలు ఉడికించి దించేయాలి.

## అప్పాలు

**కావలసిన పదార్థాలు**

సొరకాయ తురుము- ఒక కప్పు, బియ్యప్పిండి- మూడు కప్పులు, పచ్చిమిర్చి- పది (మెత్తగా రుబ్బుకోవాలి), కారం- మూడు టేబుల్ స్పూన్లు, నువ్వులు- రెండు టేబుల్ స్పూన్లు, జీలకర్ర- ఒక టీ స్పూను, ఉల్లిపాయ- ఒకటి, కరివేపాకు, కొత్తిమీర- కొద్దిగా, నూనె- వేగించడానికి సరిపడా, ఉప్పు- తగినంత.

**తయారీ విధానం**

ఒక పాత్రలో నూనె మినహా మిగిలిన పదార్థాలన్నింటినీ వేసి గారెల పిండిలా కలుపుకుని పావుగంట సేపు నానపెట్టుకోవాలి. తర్వాత అప్పాల్లా చేసుకుని నూనెలో దోరగా వేగించుకోవాలి.






## నవ్వులూ... పోరాటాలూ!




త్రీడీ యానిమేటెడ్ చిత్రాలకు పిల్లల నుంచే కాదు పెద్దల నుంచి పెద్ద ఎత్తున ఆదరణ లభిస్తుండటంతో హాలీవుడ్ చిత్ర పరిశ్రమ నుంచి వరుసబెట్టి సినిమాలు వస్తూనే ఉన్నాయి. ఆ కోవలో రానున్న మరో యాక్షన్ కామెడీ మార్షల్ఆర్ట్స్ సినిమా 'ది లెగో నింజాగో మూవీ'. ఆరుగులు టీనేజ్ కుర్రాళ్లు ఒక గురువు దగ్గర యుద్ధవిద్యలు నేర్చుకుని వింతైన వాహనాలపై ప్రయాణిస్తూ భారీ జీవుల నుంచి లెగో రాజ్యాన్ని, రాజధానిని కాపాడటమే సినిమా కథ.

## చుక్కలు కలపండి!




**నాలుకకు పదును పెట్టండి!**

**లక్ష భక్ష్యములు భక్షించు లక్ష్మయ్యకు ఒక్క భక్ష్యము లక్ష్యమా!**

## చెప్పుకోండి చూద్దాం!

రాంబాబు ఒక ఫొటో చూపిస్తూ 'ఇందులో ఉన్న అబ్బాయి... మా అమ్మ ఒక్కగానొక్క పుత్రుడికి పుత్రుడు' అన్నాడు. ఇంతకీ రాంబాబుకు, ఆ ఫొటోలో ఉన్న అబ్బాయి ఏమౌతాడు?

ఎ) తండ్రి　　బి) కొడుకు

సి) మనవడు　　డి) మావయ్య

## విలువెంత?







## చదవండి... నాటండి!

ఎవరైనా మొక్కను పెంచుకోవాలంటే ఏం చేస్తారు? విత్తనాలు చల్లుతారు. అదే ఎవరైనా వచ్చి 'మీ ఇంట్లోని వార్తాపత్రికను కుండీలో పూడ్చి, రోజూ నీళ్లు పోయండి. మొలకలు వస్తాయి' అని చెప్తే... వినడానికే వింతగా ఉంది కదూ! కానీ ఇదేమీ కొట్టిపారేయాల్సిన విషయం కాదు. జపాన్‌లో 'మినేషి' (Mainichi) అనే వార్తాపత్రికకు వ్యవసాయ వ్యర్థాలతో తయారు చేస్తున్నారు. పత్రికలోనే విత్తనాలు కూడా కాగితంతో పాటు కలిసిపోయి ఉంటాయి. ఇంట్లో అందరూ పత్రిక చదవడం పూర్తి అయిన తర్వాత పెరట్లోని పూలకుండీలో కొంచెం మట్టిని తొలగించి ముక్కలు ముక్కలుగా చించిన పత్రికను ఆ మట్టిలో పూడ్చేసి రోజూ నీళ్లు పోస్తుంటే... కొన్ని రోజులకు మొలకలు వస్తాయి. ప్రింటింగ్ కోసం వాడిన ఇంకు సైతం పాడైపోయిన కూరగాయలతో తయారు చేసిందే. అందుకే ఆ సిరా ఎరువుగా ఉపయోగపడుతుంది.

## పళ్లు తోముకుంటూ గిన్నిస్‌లోకి...



**చి**న్నారులూ... పొద్దున లేవగానే బ్రష్ చేసుకోవడం మంచి అలవాటని మీకు తెలుసు కదా! అందరికీ ఆ అలవాటు అలవడాలని, నోటి శుభ్రతపై అవగాహన కలగాలని బెంగళూరులో 'మై డెంటల్ ప్లాన్' అనే కార్యక్రమాన్ని నిర్వహించారు. ఆ సందర్భంగా ఇరవై పాఠశాలలకు చెందిన 17,505 మంది విద్యార్థులు ఒకేసారి పళ్లు తోముకుని గిన్నిస్ రికార్డు సృష్టించారు.

## బుచికి

హాలిడేస్ అయిపోగానే కట్టప్ప బాహుబలిని ఎందుకు చంపాడో మా టీచర్‌కు చెప్పేస్తా...



## నా బొమ్మ

**వి.తంగరాజ్**
ఆరవ తరగతి
భవన్స్ రెసిడెన్షియల్ పబ్లిక్ స్కూల్
తాడేపల్లిగూడెం,
ప.గో. జిల్లా



## రంగులేయండి!



## దారి కనుక్కోండి





## హోండూరస్ వైట్ బ్యాట్

**పా**త భవనాల్లో, గుహల్లో పైకప్పుకు వేలాడే నల్లని గబ్బిలాలే ఇప్పటివరకూ మనకు తెలుసు. కానీ దక్షిణ అమెరికా ఖండంలోని హోండూరస్ దేశం వెళితే అక్కడ మనం తెల్ల గబ్బిలాలను చూడొచ్చు. రెండు అంగుళాలను మించని ఈ గబ్బిలాలు మిగిలిన వాటికి భిన్నంగా పెద్ద పెద్ద ఆకులనే తమ నివాసాలుగా ఎంచుకుంటాయి. తెల్లగా ఉండటం వల్ల వాటి శత్రువులు అవేవో పువ్వులు అనుకుని భ్రమపడతాయి. భలే ముద్దుగా ఉన్నాయి కదూ ఈ తెల్ల గబ్బిలాలు!





# అనుగ్రహం

23-29 ఏప్రిల్ 2017

డాక్టర్ పి.ఎ. రామన్



**మేషం**

**అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం**

సమర్థతకు ఏమంత గుర్తింపు ఉండదు. అయినా పట్టుదలతో యత్నాలు సాగించండి. ఎదుటివారి వ్యాఖ్యలు ఆలోచింపచేస్తాయి. ఖర్చులు సామాన్యం. అయిన వారి కోసం శ్రమిస్తారు. పనులు, బాధ్యతలు ఇతరులకు అప్పగించవద్దు. పెట్టుబడులకు అనుకూలం కాదు. బ్యాంకు వివరాలు గోప్యంగా ఉంచండి. ప్రయాణంలో ప్రయాసలెదుర్కొంటారు.



**వృషభం**

**కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

లౌక్యంగా పనులు చక్కబెట్టుకోవాలి. ఆధిపత్యం ప్రదర్శించవద్దు. ఖర్చులు అధికం. ఒక వ్యవహారంలో డబ్బు అందుతుంది. పెట్టుబడులకు అనుకూలం. కొత్త యత్నాలకు శ్రీకారం చుడతారు. అవకాశాలు అందినట్టే అంది చేజారిపోతుంటాయి. గురు, శుక్ర వారాల్లో ఒక సంఘటన ఆందోళన కలిగిస్తుంది. ప్రైవేటుసంస్థల్లోని వారికి ఓర్పు ప్రధానం. శుభకార్యంలో పాల్గొంటారు.



**మిథునం**

**మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

ఆర్థిక లావాదేవీలతో హడావిడిగా ఉంటారు. ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు. స్థిమితంగా ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి. సలహాలు, సహాయం ఆశించవద్దు. పెద్ద ఖర్చు తగిలే ఆస్కారం ఉంది. మీ అభిప్రాయాలను కచ్చితంగా తెలియజేయండి. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. జూదాలు, బెట్టింగ్‌ల వల్ల చిక్కుల్లో పడే ఆస్కారం ఉంది. ఒక సమాచారం ఆలోచింపచేస్తుంది.



**కర్కాటకం**

**పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

మీ ఓర్పు నేర్పులకు పరీక్షా సమయం. అప్రమత్తంగా వ్యవహరించండి. ఎవరినీ తక్కువ అంచనా వేయొద్దు. ఆదాయ వ్యయాలు పర్వాలేదనిపిస్తాయి. అవసరాలకు డబ్బు అందుతుంది. ముఖ్యమైన వ్యక్తులను కలుసుకుంటారు. ఇంట్లో మార్పు చేర్పులకు అనుకూలం. డబ్బు చెల్లింపు, స్వీకరణలో జాగ్రత్త. అవగాహన లేని విషయాల్లో జోక్యం తగదు.



**సింహం**

**మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

కొత్త యత్నాలు ప్రారంభిస్తారు. పరిస్థితులు అనుకూలిస్తాయి. ప్రభుత్వ కార్యాలయాల్లో పనులు సానుకూలమవుతాయి. నోటీసులు, ముఖ్యమైన పత్రాలు అందుతాయి. విలువైన వస్తువులు జాగ్రత్త. బాధ్యతలు, వ్యవహారాలు స్వయంగా చూసుకోవాలి. ఎవరినీ అతిగా విశ్వసించవద్దు. ఆశాదృక్పథంతో ఉద్యోగయత్నం సాగించండి. చిన్నారులకు కానుకలందిస్తారు.



**కన్య**

**ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

లక్ష్యసాధనకు అవిశ్రాంతంగా శ్రమించాలి. మీ యత్నాలకు సన్నిహితుల ప్రోత్సాహం ఉంటుంది. ఖర్చులు అధికమైనా డబ్బుకి ఇబ్బంది ఉండదు. కొత్త విషయాలు తెలుసుకుంటారు. మానసికంగా కుదుటపడతారు. ఆరోగ్యం పట్ల అలక్ష్యం తగదు. పిల్లల విజయం సంతోషపరుస్తుంది. విందులు, వినోదాల్లో మితంగా మెలగండి. పొగిడే వారితో జాగ్రత్త.



**తుల**

**చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

రాబోయే ఆదాయానికి తగ్గ ఖర్చులుంటాయి. పొదుపు చేయాలన్న ఆలోచన ఫలించదు. పరిచయస్తులు డబ్బు సాయం చేయమని అర్థిస్తారు. బేషజాలకు పోవద్దు. అతి కష్టంమ్మీద పనులు పూర్తవుతాయి. వ్యూహాత్మకంగా వ్యవహరించాలి. సాధ్యం కాని హామీలివ్వవద్దు. మంగళ, శని వారాల్లో తప్పటడుగు వేసే ఆస్కారం ఉంది. పోగొట్టుకున్న పత్రాలు తిరిగి పొందుతారు.



**వృశ్చికం**

**విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

కుటుంబీకుల మధ్య అనురాగ వాత్సల్యాలు పెంపొందుతాయి. మాటతీరుతో అందరినీ ఆకట్టుకుంటారు. ఖర్చులు భారమనిపించవు. అవసరాలు, కోరికలు తీరుతాయి. శ్రమాధిక్యతతో పనులు పూర్తి చేస్తారు. ఒక సమాచారం ఆలోచింపచేస్తుంది. తొందరపడి నిర్ణయాలు తీసుకోవద్దు. ఎదుటివారి ఆంతర్యం గ్రహించండి. బాధ్యతలను ఇతరులకు అప్పగించవద్దు.



**ధనుస్సు**

**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

పెట్టుబడులకు అనుకూలం. వ్యవహార ఒప్పందాల్లో ఏకాగ్రత వహించండి. అవసరాలకు డబ్బు సర్దుబాటవుతుంది. పనులు సానుకూలమవుతాయి. ఆందోళన కలిగించిన సమస్య సద్దుమణుగుతుంది. వాగ్వాదాలు, పంతాలకు పోవద్దు. ఆంతరంగిక విషయాలు వెల్లడించవద్దు. అవకాశాలు చేజారినా ఒకందుకు మంచిదే. మీ కృషి ఫలించే రోజు త్వరలో ఉంది.



**మకరం**

**ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు**

అవిశ్రాంతంగా శ్రమిస్తారు. సమర్థతకు ఏమంత గుర్తింపు ఉండదు. అవకాశాలను తక్షణం వినియోగించుకోండి. సలహాలు, సహాయం ఆశించవద్దు. స్వయంకృషితో రాణిస్తారు. ఖర్చులు విపరీతం, ఒక అవసరానికి ఉంచిన డబ్బు మరో దానికి వ్యయం చేస్తారు. మీ కోపతాపాలను అదుపులో ఉంచుకోండి. పిల్లల చదువుల గురించి ఆలోచిస్తారు. దళారులను విశ్వసించవద్దు.



**కుంభం**

**ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

వ్యవహారాలు, లావాదేవీలతో హడావిడిగా ఉంటారు. ఆలోచనలు కార్యరూపం దాల్చుతాయి. శుభకార్యాన్ని ఘనంగా చేస్తారు. ఖర్చులు అధికం. ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు. గృహ నిర్మాణాలు మందకొడిగా సాగుతాయి. ఏజెన్సీలు, లీజు పొడిగింపులకు అనుకూలం. ఆస్తి, స్థల వివాదాలు కొలిక్కి వస్తాయి. నిరుద్యోగులకు ఉద్యోగయోగం. విద్యార్థులు ఏకాగ్రతతో ఉంటారు.



**మీనం**

**పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

ఆదాయానికి తగ్గ ఖర్చులు రూపొందించుకుంటారు. ఒక వ్యవహారంలో డబ్బు అందుతుంది. విలాస వస్తువులు కొనుగోలు చేస్తారు. పనుల ప్రారంభంలో ఆటంకాలెదురవుతాయి. ఆహ్వానాలు, నోటీసులు అందుతాయి. బాధ్యతలు ఇతరులకు అప్పగించవద్దు. అప్రమత్తంగా వ్యవహరించాల్సిన సమయం. నమ్మకస్తులే తప్పుదారి పట్టించేందుకు యత్నిస్తారు.

# సొరియాసిస్ వ్యాధి పునాదులు కదులుతాయి

చనిపోయి మళ్లీ పుడితేనే పునర్జన్మ అని కాదు. ఏళ్ల పర్యంతంగా వేధిస్తూ వచ్చిన ఒక తీవ్రమైన వ్యాధి నుంచి పూర్తిగా బయటపడటం కూడా పునర్జన్మే అవుతుంది. సొరియాసిస్ నుంచి వి ముక్తి పొందడం కూడా కృతంగా పునర్జన్మే అ వుతుంది. దురదా మంటలతో నరకాన్ని చూపిస్తూ, నిద్ర ఆహారాలకు కూడా దూరం చేసే సొరియాసిస్ నుంచి విముక్తం చేయగలిగేది ఆ యుర్వేదం కాక మరేముంది? ఆరోగ్యం విష యంలో సమాధానం లేని ప్రశ్నలు గానీ, పరిష్కారం కాని సమస్యలు గానీ ఏమీ ఉండవని ఆయుర్వేదం బలంగా నమ్ముతుంది. కాకపోతే ఆ యా విషయాల్లో మనసునంత లోతుగా లగ్నం చేయాల్సి ఉంటుంది. ఎన్ని మందులు వాడినా, సొరియాసిస్ ఎప్పటికీ పోదేమో అనుకుంటారు చాలా మంది. ఎంత సేపూ వ్యాధి లక్షణాలను అణచివేయడమే తప్ప, వ్యాధి మూలాలను తొలగించే వైద్యం అందనప్పుడు సొరియాసిస్ అలా కొనసాగుతూనే ఉంటుంది.

**భిన్నత్వమే విశిష్టత**

ఆయుర్వేద వైద్య విధానం మిగతా అన్ని వైద్య విధానాల కన్నా ఎంతో భిన్నమైనది. వ్యాధి రావడానికి గల అసలు కారణాలను పరిశీలించి, వాటిని సమూలంగా తొలగించే అన్ని చర్యలూ తీసుకుంటుంది. చర్మం మీదే కనిపించే సొరియాసిస్‌కు ధాతువులను దెబ్బ తీసేంత శక్తి ఉంటుందా అని కూడా కొందరు అనుకుంటారు. నిజానికి సొరియాసిస్‌కు సప్తధాతువులనే కాదు, సమస్త శరీర వ్యవస్థలనూ ధ్వంసం చేసే తత్వం ఉంటుంది. అలా ధాతువులు క్షీణిస్తూ వెళ్లే కొద్దీ శరీరంలో వాతం పెరిగిపోతుంది. ఒక్క వాతం సంతులనం (బ్యాలెన్స్) కోల్పోతే ఆ ప్రభావంతో మిగతా పిత్తం, కఫం కూడా సంతులనం కోల్పోతాయి. అయితే, చికిత్సా విధానాలతో ఒక్క వాతాన్ని తిరిగి సాధారణ స్థితికి తెస్తే, పిత్త కఫాలు కూడా సాధారణ స్థితికి వస్తాయి. అందుకే ఆయుర్వేదం వాత నియంత్రణకు అత్యధిక ప్రాధాన్యతనిస్తుంది.

**ఆయుర్వేదమే అసలైన వైద్యం**

ఎన్నో ఏళ్లగా వైద్య చికిత్సలు తీసుకుంటూనే ఉన్నాం. అ యినా సొరి యాసిస్ ఏ మాత్రం తగ్గలేదని చాలా మంది వాపోతుంటారు. కానీ, ఆ చికిత్సలు పై పై పూతలకే పరిమితమైనవా? శరీరం లోలోతుల్లోకి వెళ్లి సప్తధాతువులనూ ఉత్తేజితం చేసినవా? అన్నది ప్రశ్న. సొరియాసిస్ మచ్చలు చర్మం మీదే కనిపిస్తున్నాయని, పైపై వైద్యాలకే పరిమితమైతే సొరియాసిస్ రోజురోజుకూ పెరుగుతూనే వెళుతుంది. అందుకే, కేవలం బాహ్య చికిత్సలకో లేదా ఔషధాలకో పరిమితమైతే సొరియాసిస్‌కు అది పరిపూర్ణ వైద్యం కాదు. సొరియాసిస్‌కి కారణమైన ఆమాన్ని అంటే విషపదార్థాలను ముందు పంచకర్మ చికిత్సల ద్వారా తొలగించాలి. ఆ తరువాత ధాతుక్షయాన్ని నివారించే ఔషధాలు కూడా ఇవ్వాలి. వమనం, విరేచన కర్మల ద్వారా శరీరంలోని మలినాలన్నీ తొలగిస్తే వాతం అప్పుడు నియంత్రణలోకి వస్తుంది. మిగతా పిత్త, కఫాలు కూడా అదుపులోకి వస్తాయి. అప్పుడే సొరియాసిస్ సమూలంగా తొలగిపోతుంది. ఆయుర్వేదం ఎటువంటి జటిలమైన సమస్యనయినా సవాలుగా తీసుకుంటుంది. దానికి సమాధానం చెప్పి తీరుతుంది. ఇదేదో నమ్మకానికి సంబంధించింది ఎంత మాత్రం కాదు. ఇది పక్కా శాస్త్రీయమైన చికిత్స అందుకే అందుకే సొరియాసిస్ వ్యాధి ఆయుర్వేదం ముందు తలవంచుతోంది. అలా సొరియాసిస్ బాధితులు సమాజంలో మునుపటిలా సగౌరవంగా బతికేలా చేస్తోంది.



**డాక్టర్ ఎన్. రామకృష్ణారెడ్డి**
**ఆర్.కె ఆయుర్వేదిక్ అండ్ సొరియాసిస్ రీసెర్చ్ సెంటర్**

| | |
|---|---|
| కూకట్‌పల్లి | 8886922245 |
| నాంపల్లి | 8886922247 |
| హన్మకొండ | 8886922248 |
| విజయవాడ | 8886922249 |
| వైజాగ్ | 8886922250 |
| కర్నూలు | 8886922251 |
| తిరుపతి | 8886922252 |

## స్వర్ణామృతప్రాశనతో ఆటిజానికి స్వస్తి

పిల్లల్లో శారీరక ఎదుగుదల ఆగిపోతే, కొద్ది రోజుల్లోనే తెలిసిపోతుంది. అదే మానసిక ఎదుగుదల ఆగిపోతే గుర్తించడం అంత సులువేమీ కాదు. ఆటిజంతో వ చ్చే క్కే ఇది. సహజంగా పిల్లలమీద తలిదండ్రులు మీద ఉండే వల్లమాలిన ప్రేమ వల్ల వారికి పిల్లల లోపాలు గానీ తప్పిదాలుగానీ వెంటనే మనసుకు తెలియవు. . ఒ కవేళ ఎప్పటికో వాళ్ల దృష్టికి వచ్చినా తమ పిల్లవాడు ఒ క పెద్ద లోపంతో ఉన్నాడనే నిజాన్ని ఒప్పుకోవడానికి మనసు ఒ క పట్టాన అంగీకరించదు. కానీ, వాళ్ల మనసు అంగీకరించనంత మాత్రాన ఉన్న లోపాలు వాటికవే మాయమైపోవు కదా! మన మన ఇష్టాఇష్టాలు ఎ లా ఉన్నా, ప్రతి తలిదండ్రీ ఆటిజం వ్యాధి లక్షణాల గురించి తెలిసి ఉండడం చాలా అ వసరం.

**ఆటిజంలో ఏమవుతుంది.?**

శారీరక ఎదుగుదలతో సమానంగా, మానసిక ఎదుగుదల కూడా ఆగిపోతుంది. ఆటిజం వ్యాధిగ్రస్తుల్లో తాము చేయాల్సిన పనేమిటో, చేయకూడనిదేమిటో తెలియని ఒక నిస్సహాయత ఆటిజం బాలబాలికల్ని పీడిస్తుంది. ఆటిజంలో వయసుతో పాటు రావల్సిన జ్ఞానమేదీ రాదు. విషయాల్ని గుర్తించే శక్తి ఉండదు. ఎవరితోనూ కలవకుండా ఒంటరిగా ఉండడాన్ని ఇష్టపడతారు. ఆటిజంలో కొంతమంది పిల్లల్లో అతిగా ప్రవర్తించే హైపర్ యాక్టివ్ లక్షణాలు కూడా కనిపిస్తాయి.

**ఆటిజం కారణాల్లోకి వెళితే.....**

● ఎదుటి వారి కళ్లలోకి చూస్తూ ఎప్పుడూ మాట్లాడరు. ఈ పిల్లలకు మాటలు వచ్చినా ప్రతిసారీ రెండు పదాలకు మించి మాట్లాడరు. అయతే ఆ రెండు మాటల్నే మళ్లీ మళ్లీ చెబుతారు.

● హైపర్ యాక్టివిటీ వీరిలో కనిపిస్తుంది. అన్ని విషయాల్లో అతిగా వ్యవహరించడం కనిపిస్తుంది. తనంతట తాను అరవడం, కేకలు వేయడం తను అలా ఎందుకు చేస్తున్నాడో తానేమీ తెలిసే స్థితిలో ఉండడు. ఒక్క నిమిషమైనా ఒక చోట స్థిరంగా నిలబడరు.

**స్వర్ణామృత ప్రాశన వల్ల జరిగేదేమిటి?**

ఆటిజంలోని ప్రధాన సమస్య మెదడుకు శరీరానికి మధ్య సంబంధం తెగిపోవడం. అలా తెగిపోవడానికి మెదడు తన సహజమైన పటుత్వాన్ని కోల్పోవడమే కారణం. ఈ స్థితిలో స్వర్ణామృత ప్రాశన మెదడుకు శక్తిని ప్రసాదిస్తుంది. మొత్తం నాడీ వ్యవస్థను, మెదడులోని స్పీచ్ సెంటర్లను చైతన్యపరుస్తూ బాడీకి కనెక్ట్ అయ్యేలా చేస్తుంది. అందుకే స్వర్ణామృత ప్రాశన వాడటం మొదలెట్టిన మొదటి రెండు నెలలలోపల మాట రావడాన్ని గమనించవచ్చు. ప్రతి సందర్భంలోనూ స్పష్టంగా మాట్లాడలేకపోయినా తొలుత సంజ్ఞల రూపంలోనైనా తన మనోభావాల్ని వ్యక్తం చేయడం మొదలవుతుంది. 5వ నెల వచ్చేసరికి అప్పటిదాకా ఉంటూ వచ్చిన హైపర్ యాక్టివ్ తత్వం, స్వర్ణామృతప్రాశనలో స్వర్ణభస్మంతో పాటు, మనిషి మేధోశక్తిని పెంచే మేధోద్రవ్యాలు కూడా ఇందులో ఉన్నాయి. ఇవి ఆటిజం పిల్లల ఐ.క్యూ లెవెల్‌ను పెంచడంలో ఎంతో ఉపయోగపడతాయి. స్వర్ణామృతప్రాశనంతోపాటు ఎడిహెచ్‌డి. హైపర్ యాక్టివిటీ డిజార్డర్‌లో నస్యకర్మతోపాటు కొన్ని ప్రత్యేకమైన చికిత్సలను అందుబాటులోకి తేవడం జరిగింది. అందువల్ల స్వర్ణామృతప్రాశన వాడుతూ, ఈ చికిత్సలను కూడా తీసుకుంటే, ఆటిజం నుంచి బయటపడటమే కాదు, అందరికీ సరిధీటుగా అడుగులు ముందుకు వేస్తారు. అనుకున్నది సాధిస్తారు.

## అపురూప వ్యక్తిత్వం

ప్రముఖ పారిశ్రామికవేత్త, కృష్ణపట్నం ఓడరేవు ఛైర్మన్ చింతా విశ్వేశ్వరరావు (సి.వి.ఆర్) జీవిత విశేషాల సంకలనం ఈ 'సీవీఆర్ జీవన తరంగాలు.' అతి సాధారణ కుటుంబంలో పుట్టి, స్వయంకృషితో ఓ పారిశ్రామికవేత్తగా ఎదిగి, నిస్వార్థంగా పది మందికీ సహాయంగా ఉంటూ, నిరాడంబరంగా జీవిస్తున్న ఓ వ్యక్తి విజయ ప్రస్థానం తప్పక తెలుసుకోవాల్సిన విషయమే.

సీవీఆర్ జీవిత విశేషాలను అచ్చమైన, స్వచ్ఛమైన తెలుగులో ఆవిష్కరించిన సి.వెంకటకృష్ణ, సహ రచయిత డాక్టర్ కె.బాబూరావు ఎక్కడా అనవసర విశేషణాలు లేకుండా ఉన్నది ఉన్నట్లు అందించారు. సీవీఆర్‌కి సంబంధించి గతంలో 'విశిష్ట వ్యక్తిత్వం' అనే గ్రంథం వెలువడింది. దాని కొనసాగింపుగా ఈ 'జీవన తరంగాలు' ప్రచురించారు. ఆయనలోని నిఖార్సయిన వ్యక్తిత్వం, పట్టుదల, నిర్ణయాత్మక శక్తి, అచంచల ఆత్మవిశ్వాసం తదితర లక్షణాలు ఈ పుస్తకంలో చక్కగా అభివ్యక్తమయ్యాయి.

పారిశ్రామికవేత్త స్థాయికి ఎదిగిన సీవీఆర్ జీవితం వడ్డించిన విస్తరి కాదు. ఎన్నో ఆటుపోట్లను, కష్టనష్టాలను ఎదుర్కొన్నారు. వీటన్నిటికీ ఎదురీది, వ్యయప్రయాసలకు ఓర్చి తన పారిశ్రామిక, వాణిజ్య సామ్రాజ్యాన్ని నిర్మించుకున్నారు. ఎందరికో ఉపాధి కల్పించిన సీవీఆర్ మరెందరికో అండా దండా అయ్యారు.

ఆయన జీవిత విశేషాలు నిజంగా ఎంతో స్ఫూర్తిదాయకమైనవి. ఇవి యువత సర్వతోముఖాభివృద్ధికి, వ్యక్తిత్వ వికాసానికి ఉపయోగపడడమే కాకుండా, ఎందరో ఔత్సాహిక వ్యవస్థాపకులకు మార్గదర్శకంగా కూడా నిలుస్తాయి.

**- జి. రాజశుక**

**సి.వి.ఆర్ జీవన తరంగాలు**
**రచయిత:** సి. వెంకటకృష్ణ
**సహ రచయిత:** డాక్టర్ కె.బాబూరావు
**పేజీలు :** 118,
**వెల:** రూ. 150
**ప్రతులకు:** కోటలెక్ బుక్స్
**ఫోన్:** 040-23306789, 98490 66789




## నవ్వుకునేవారికి నవ్వుకునేంత!

'ఎవరూ పుట్టించకపోతే మాటలెలా పుడతాయ'నేది 'మాయాబజార్'లో పింగళి మాట. పుట్టించడం తప్పుకాదు కాని వాటిని దొంగిలించడం మాత్రం తప్పంటారు శంకరనారాయణ. ఇంగ్లీషువారు తెలుగు భాషలోని అనేక పదాలను కొట్టేసి తమ భాషలో కలిపేసుకున్నారనేది ఆయన అభియోగం. 'వరి'ని ఆంగ్ల నెలల్లోనూ, 'అబ్బాయ్'ని 'బాయ్'గా, 'మనిషి'ని 'మ్యాన్', 'షి'గా విడదీసి, 'త్రాడు'ని 'త్రెడ్'గా .. ఇలా పలు ఉదాహరణలు జోడించి హాస్య విమర్శలు గుప్పించారు. ఆడవాళ్ల మాటలకు కాదు, తెలుగువాళ్ల మాటలకు అర్థాలే వేరులే అంటారు. ఈ వరసలో నిత్యం వాడే పదాల గుట్టు రట్టు చేశారు. బెదిరించడంలో 'నీ భాగోతం బయట పెడతా'మనడం, లంచం అనే మాట వాడకంలో 'ముడుపులు చెల్లించడం' వంటివి ఉదహరించారు. ఎవరికే ఆపదొచ్చినా 'అయ్యో పాపం' అనేది నాలుక చివరుండే మాట. కాబట్టి తెలుగువాడికి 'పాపభీతి' మెండని వెటకరిస్తారు.

**- గొరుసు**

**ఇంగ్లీషుకు తల్లి తెలుగు?!**
హాస్యబ్రహ్మ శంకరనారాయణ
**పేజీలు :** 186, **వెల :** రూ. 144
**ప్రతులకు:** 94919 62759




కొత్త పుస్తకాలు

## సంస్కృతి ప్రతిబింబాలు

సంక్షోభ భరిత వర్తమానాన్ని అత్యంత సంప్రదాయకంగా, సంస్కారయుతంగా 'భారతీయత' కోణంలో చిత్రించిన స్కెచ్‌లు గుండు సుబ్రమణ్య దీక్షితుల కథల సంపుటి 'అమ్మ అజ్ఞానం'. తొలితరపు తెలుగు కథలోని ఉదాత్తత, భావుకత, సంస్కరణ ఈ సంపుటిలోని 32 కథల్లో చోటుచేసుకుని ఆ కోవకు చెందిన పాఠకులను ఆహ్లాదపరుస్తుంది. సమకాలీన మధ్యతరగతి జీవితాల ఆనంద, విషాదాలకు, అలజడి ఆందోళనలకు భారతీయ సంస్కృతి- వారసత్వంలో సమాధానాలు వెతికి చూపించిన కథలివి. భారతదేశ నలుమూలల సంస్కృతిని ఇందులోని పర్యాటక కథలు పాఠకులకు పరిచయం చేయడం ఈ సంపుటిలోని ఒక ప్రత్యేకత.

**- డా. డి. లెనిన్**

**అమ్మ అజ్ఞానం**
గుండు సుబ్రమణ్య దీక్షితులు
**పేజీలు :** 248, **వెల :** రూ.125
**ప్రతులకు :** 0866 - 2436643




ఇవీ వచ్చాయి

**ప్రజా కళలు**
పికెఎం ప్రభాకర్ రచనలు
**పేజీలు :** 136, **వెల :** రూ.70
**ప్రతులకు :** డి.వి. రామకృష్ణారావు, ఎం.ఐ.జి - 14, ఎపిఐఐసి కాలనీ, మౌలాలి, హైదరాబాద్ - 40

**శ్రీ పాంచరాత్ర శాస్త్రాంతర్గత పరమ సంహిత**
**సం. :** డా. నల్లంతిగళ్ లక్ష్మీనరసింహాచార్య
**పేజీలు :** 204, **వెల :** రూ.250
**ప్రతులకు :** 92473 55355

**సరస్వతీపుత్రులు**
(తెలుగు సాహితీ సుగంధాలు)
**పేజీలు :** 122, **వెల :** రూ.63

**కలం సత్రం** (మీడియా నవల)
**రచన :** మహేష్ కొంగర
**పేజీలు :** 268, **వెల :** రూ.200
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

**బంగారు నెలవంకలు**
(బడిపిల్లల కథలు - రాజన్న సిరిసిల్ల జిల్లా)
**సం. :** డా. వి.ఆర్. శర్మ
**పేజీలు :** 80, **వెల :** రూ.60
**ప్రతులకు :** 91778 87749

**ది ఈకొనామి ఆఫ్ హ్యూమన్ లైఫ్**
**మూలం :** బ్రామన్, **తెలుగు :** నిడమర్తి రామయ్య
**పేజీలు :** 116, **వెల :** రూ.125
**ప్రతులకు :** 94415 84375

**గురజాడ - మన విమర్శకులు**
**రూపకల్పన :** ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి
**పేజీలు :** 74, **వెల :** రూ.100
**ప్రతులకు :** 94402 22117

**సాహిత్యంలో వస్తు రూప శిల్పాలు**
**రచన :** వి. చెంచయ్య
**పేజీలు :** 36, **వెల :** రూ.40
**ప్రతులకు :** 94403 31016

## బేతాళ ప్రశ్న - 30



ఒక రైతు దగ్గర 17 గుర్రాలు ఉన్నాయి. ఆయనకు ముగ్గురు కుమారులు. అతడు మొత్తం గుర్రాలలో సగం పెద్ద కుమారుడికి చెందుతాయని, 1/3వ భాగం రెండో కుమారుడికి, 1/6వ భాగం మూడో కుమారుడికి చెందుతాయని వీలునామా రాసి చనిపోయాడు. ఆ ముగ్గురు ఎంత ప్రయత్నించినా వాటిని ఎలా పంచుకోవాలో అర్థం కాలేదు? మరి మీరైనా వారికో పరిష్కారం చూపించండి.

(పంపినవారు: **సి. సుబ్బారావు**, నెల్లూరు)

**మీ దగ్గర ఇలాంటి బేతాళ ప్రశ్నలు ఉంటే జవాబుతో పాటు మా ఈమెయిల్ kerintha.aj@gmail.comకు పంపించగలరు**

**గతవారం సమాధానం:**

Queue. చివరి నాలుగు అక్షరాలు తీసేసినా పలకడంలో ఎటువంటి మార్పు రాదు.

**బేతాళ ప్రశ్న- 28కు సరైన సమాధానం చెప్పిన మొదటి ముగ్గురు:**

రబ్బాని షేక్, ఈమెయిల్

నర్రా ప్రతాప్, ఈమెయిల్

పి. రమేష్, ఈమెయిల్

## పూరణం

నిర్వహణ : గొరుసు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ❄ | 3 | | ❄ | 4 | 5 | 6 | |
| | ❄ | 7 | | | ❄ | ❄ | 8 | | | ❄ |
| 9 | 10 | | ❄ | ❄ | 11 | | | ❄ | ❄ | 12 |
| ❄ | | ❄ | 13 | 14 | | ❄ | ❄ | 15 | | |
| 16 | | ❄ | 17 | | ❄ | 18 | 19 | | ❄ | ❄ |
| | ❄ | 20 | | ❄ | 21 | | | ❄ | 22 | |
| ❄ | 23 | | ❄ | 24 | | | ❄ | 25 | | ❄ |
| ❄ | 26 | | ❄ | | ❄ | 27 | 28 | | ❄ | 29 |
| 30 | | ❄ | 31 | | 32 | ❄ | 33 | | | |
| 34 | | 35 | | ❄ | 36 | | | ❄ | ❄ | |
| | ❄ | | ❄ | 37 | | ❄ | 38 | | | |

### అడ్డం

1. సిరిగల దేశమే - ప్రస్తుతం అల్లకల్లోలం(3)
3. ఓర్వలేనితనం (2)
4. ఇందులో పొరపాటు సహజం (4)
7. సీతమ్మవారి పుట్టినూరు (3)
8. ఎద్దు భుజశిఖరం (3)
9. గజనిలా ధ్వనించే రాత్రి (3)
11. జిహ్వ యావ (3)
13. ప్రతిష్ఠ జోడి (3)
15. సంధ్యావందనంలో జపించే మంత్రం (3)
16. పితృదేవతలకు పెట్టేది (2)
17. వర్షాకాలం తర్వాత పండించే పంట (2)
18. - - - లో ఉపాయం! (3)
20. సాదాసీదాలో సగం (2)
21. శరీరం (3)
22. పెదవి (2)
23. దేవుడిచ్చినా పూజారి అడ్డుకునేది! (2)
24. పార్వతీదేవి పేరుతో ఒక రాగం (3)
25. అడ్డం 21లోనిదే (2)
26. యూపీ సీఎం - - ఆదిత్యనాథ్ (2)
27. తక్కువతనం (3)
30. అయోనిజలో జాడ వెతకండి (2)
31. కుండలు మన్నేనోయ్ అన్న దేవదాసే దీన్ని కొయ్యేనన్నాడు! (3)
33. పిశాచ గణాధిపతి (4)
34. ఇప్పుడు జిల్లాగా మారిన నిన్నటి మహబూబ్‌నగర్ ప్రాంతం (4)
36. తొలినాటి మొగల్ చక్రవర్తి (3)
37. ఉర్దూ గృహం (2)
38. ప్రథమా విభక్తి (4)

### నిలువు

1. భానుప్రియ తొలి తెలుగు చిత్రం (3)
2. అడ్డం 9లో ఉన్నదే (3)
3. తెలుగు 'విజిల్' (2)
4. వెల లేనిది (3)
5. తలాతోకా లేని తలపులు (2)
6. ఏడు రోజులకు సమానం (2)
10. తగాదా (3)
11. వాడుకలో మృత్యువు (2)
12. చెలిమి (2)
13. తెర (3)
14. ఒక రకం మద్యం.. తాగితే ఇట్లాగే పల్టీ కొడ్తారు (2)
15. దెబ్బ - కాలం మాన్పేది (2)
16. ఫలదీకరణ తర్వాతి దశ (2)
18. అరణ్యంలో (4)
19. సగం మురిపాలు (2)
20. ఒక సంగీత వాయిద్యం (3)
21. రెండు కత్తులో ఇందులో ఇమడవంటారు (2)
22. సవరించిన మొహంతో పుట్టిన వలపు(2)
23. వయసు మళ్లినవారికి నేర్పించే విద్య (4)
24. సింగీతం శ్రీనివాసరావు వెండితెర ద్వీపం (3)
25. దేవతను పిలవండి (3)
28. దేవతల్లో ఐశ్వర్యవంతుడు (4)
29. టాటా - - - - గుడ్‌బై ఇంక సెలవు!(4)
30. వనితో అంతమైన భూమి (3)
31. నాగార్జునకు 'ఊపిరి' పోసిన తమిళ హీరో (2)
32. పరీక్షలో కాపీ కొడితే ఏం చేస్తారు? (3)
35. కొందరు మాటలు చెప్పి జరుపుకునే పండగ (2)

### గత వారం జవాబులు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఉ | స్మా | 2 ని | 3 యా | ❄ | 4 భా | ను | 5 మ | 6 తి | ❄ | 7 రై |
| న్మా | ❄ | 8 ర్మా | వ | 9 వి | ర | ❄ | 10 న | మ్మ | 11 కా | లు |
| 12 ది | 13 వా | ను | ❄ | 14 తం | తి | ❄ | 15 సు | రు | లు | ❄ |
| ❄ | 16 పు | ష్యం | ❄ | డ | ❄ | 17 ని | ❄ | 18 సు | వ | 19 ర్ణ |
| 20 పి | ❄ | ❄ | 21 ప | ❄ | 22 తు | షా | 23 రం | ❄ | ❄ | క |
| కా | ❄ | 24 ప్ర | తా | 25 పం | ❄ | ❄ | 26 గ | 27 డ్డ | పా | ర |
| 28 సో | 29 నా | ❄ | 30 క | ల | 31 హం | ❄ | 32 నా | గు | ❄ | ఘా |
| ❄ | గ | ❄ | ❄ | 33 బ | ద్రి | 34 నా | థ్ | ❄ | 35 న | ర |
| 36 అ | మ్మ | 37 త | ల్లి | ❄ | ❄ | రిం | ❄ | 38 వా | స | వీ |
| క్ష | ❄ | మ | ❄ | 39 ఇం | 40 ద్ర | జ | ❄ | ద | ❄ | న |
| య | ❄ | 41 కం | రే | తి | వ్య | ❄ | ❄ | 42 న | ర్మ | దా |

